

# ఐక్యరాజ్యసమితి

## ప్రథమ పుస్తకము





# ఐక్యరాజ్య సమితి

## ప్రథమ పుస్తకము



మూలం:

ఎడ్నా ఎప్స్టీన్

అనువాదం:

శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్, యం. ఏ., యం.



ప్రకాశకులు:

యం. శేషాచలం అండ్ కో

మద్రాసు : మచిలీపట్టణము : సికిందరాబాదు,

AIKYA RAJYA SAMITI :— *Original by* Edna Epstein

Translated by Srimati Kanakadurga Ramachandran, M.A., M.Ed.



All pictures are published with the courtesy of the United Nations. Organizations within the United Nations responsible for the following pictures are :

| | |
|---|---|
| UNICEF | pages 55, 56 |
| WHO | „ 59, 60, 61 |
| FAO | „ 64 |

[ప్రథమ ముద్రణ, జూలై '62]

వెల రూ. **2–50.**




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సువారి 'ఇంటింటా స్వంతగ్రంథాలయం' ప్రణాళిక చందాదారులకొరకు ప్రత్యేక ప్రచురణ

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు

రాష్ట్రపతిరోడ్డు : : సికిందరాబాదు,

# తొలిపలుకు

సుఖవంతమూ, శాంతిప్రదమూ అయిన భావికాలాన్ని గురించిన మానవుని మహత్తర ఆకాంక్షను ఐక్యరాజ్యసమితి వ్యక్తపరుస్తుందని అంటూ ఉంటారు. అటువంటప్పుడు దాని కృషిని గురించీ, సమస్యలను గురించీ, లక్ష్యాలను గురించీ ప్రజలు ఎంత తొందరగా తెలుసుకోగలిగితే అంత మంచిది.

ప్రథమపుస్తక పరంపరలో ఫ్రాంక్లిన్ వాట్స్‌వారు ప్రచురించిన యీ పుస్తకం ఆ గమ్యానికే దారితీస్తున్నది. ఒక జటిలమైన వ్యవస్థను గురించి విపులంగానూ, సులభంగానూ అర్థమయ్యే శైలిలో శ్రీమతి ఎప్‌స్టీన్ తేటతెల్లంగా వ్రాశారు. ఇది యీవిధంగానే ఉండితీరాలి. ఆమె యీ పుస్తకం ప్రవీణులైనవారికోసం వ్రాయలేదు. అందరికీ అర్థంకావాలనే దృష్టినే ఆవిడ అవలంబించారు. ఆమె వ్రాసిన యీ అద్భుతపుస్తకం ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలను గురించి తెలుసుకోవాలనుకునేవారికి చక్కని పరిచయంగా అక్కరకు వస్తుంది.

ఆల్ఫ్రెడ్ జి. క్యాట్‌జీన్
పౌర సమాచార కార్యాలయ తాత్కాలికాధిపతి
ఐక్యరాజ్యసమితి

# విషయసూచిక



8 ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యాలయం, న్యూయార్కు



## ఇది ప్రపంచానికి చెందినది

"........ఇటుపై అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఒక భాగం ప్రపంచానికి చెందుతుంది."

అంటూ అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ 1949 అక్టోబరు ఇరవై నాలుగవ తేదీన అన్నారు. ఐక్యరాజ్యసమితియొక్క ప్రధాన కార్యాలయ నిర్మాణానికి పునాదిరాయి న్యూయార్కు పట్టణంలో వేయబడింది.

మొదటి యవెన్యూకీ, మన్హాటన్‌లోని తూర్పునదికీ మధ్యగల పద్దెనిమిది ఎకరాల స్థలంలో ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యాలయం ఆక్రమించుకున్నది. ఈ స్థలాన్ని జాన్ డి. రాక్‌ఫెల్లర్ జ్యూనియర్ ఐక్యరాజ్యసమితికి కానుకగా ఇచ్చారు. న్యూయార్కు నగరం అదనంగా కొంత స్థలాన్నీ, తూర్పునదిపై ముఖద్వార హక్కులనూ అప్పగింత పెట్టింది. ఇంకా ఐక్యరాజ్యసమితి ప్లాజా భవనంకూడా కట్టించి ఇచ్చింది.

ప్రెసిడెంట్ ట్రూమన్ చెప్పినట్లు ఐక్యరాజ్యసమితి స్థలము, భవనములు అంతర్జాతీయ ప్రాంతమునకు చెందినవి. అంటే యీ ప్రాంతానికి సంబంధించిన చట్టాలన్నింటినీ ఐక్యరాజ్యసమితే చేస్తుందన్నమాట. ఐక్యరాజ్యసమితికి ప్రత్యేకంగా పతాకం ఉంది. ఆ ప్రాంతంలో పహరా ఇవ్వడానికి స్వంతంగా రక్షకభటులు ఉన్నారు. రేడియో ప్రసారానికి ప్రత్యేక ఏర్పాట్లు ఉన్నాయి. ఇరవై నాలుగు భాషల్లో యీ ప్రసారాలు జరుగుతూ ఉంటాయి. సమితికి స్వంత తపాలా ఆఫీసు ఉంది. అక్కడ తపాలాబిళ్ళలను స్వయంగా విడుదల చేస్తూ ఉంటుంది.

# ఐక్యరాజ్యసమితి అంటే ఏమిటి?

ఐక్యరాజ్యసమితి ఒక రాజ్యము కాదు. ఒక ప్రపంచ ప్రభుత్వమూ కాదు. దానికి పౌరులు లేరు. ఎటువంటి పన్నులూ అది వసూలు చెయ్యదు. దానికి స్థిరమైన సైన్యమూ లేదు.

ఐతే, ఐక్యరాజ్యసమితి ప్రపంచంలో శాంతిని నెలకొల్పే ఒక అద్భుత శక్తి. అదే దాని అత్యంత ప్రధాన కర్తవ్యం. అప్పటికి రణరంగంలో తలపట్లు పడుతున్న యుద్ధాలను అది నిలిపివేసింది.

ఐక్యరాజ్యసమితి జీవనస్థాయిని వృద్ధిచేయడానికీ, ప్రపంచంలోని అన్ని ప్రాంతాల ప్రజాజీవితవిధానాన్నీ మెరుగుపరచదానికీ ప్రయత్నిస్తోంది. ఈ కృషి శాంతిసంస్థాపనకి ఎంతో సహాయంచేసింది.



అర్ధ వలయాకారపు ఆసన శ్రేణులతో తీర్చి దిద్దిన సమితి సభా మందిరం

ఈ ఐక్యరాజ్యసమితి యు. యన్. పేరున మనలో చాలామందికి బాగా పరిచయమై ఉంది. ఐక్య రాజ్యసమితికి అయ్యే ఖర్చు నిమిత్తమై సభ్యరాజ్యాలు తమవంతుకు చెల్లించే సొమ్ము అతి స్వల్పంగానే ఉంటుంది. దామాషాన ఒక్కొక్క అమెరికను పౌరుడూ సంవత్సరానికి పదకొండు సెంట్లు చెల్లిస్తాడు. ఇది ఇంచుమించు ఒక ఐస్‌క్రీం ఖరీదుకంటే ఎక్కువ ఉండదు. ఇతర దేశస్థులు ఇంకా తక్కువే చెల్లిస్తారు. ఆయారాజ్యాల ఆర్థిక స్తోమతను బట్టి ఏ రాజ్యం ఎంత చెల్లించవలసిందీ నిర్ణయింపబడుతుంది.

## ఒకరి నొకరు అర్థం చేసుకోటం

ఐక్యరాజ్య సమితియొక్క సర్వసభ్య సమావేశాన్ని మీరు చూడటానికి గనక వెళ్ళితే మీరు అక్కడ గమనించేదేమిటంటే -



ఒక విశాలవలయాకారమైన గదిలో ఎనిమిదివందలకు పైగా స్త్రీలూ, పురుషులూ అర్ధవలయాకారపు వరుసలుగా, శిఖరమువంటి కప్పుగల గదిలో కూర్చుని ఉంటారు. వీరు ప్రతినిధులు (డెలిగేట్లు). తమకు ప్రాతినిధ్యం వహించేందుకు ఆయా ప్రభుత్వాలు వీరిని నియోగించినవి. ప్రపంచంలోగల దాదాపు ప్రతిదేశంనుండి వారు వస్తారు.

డెలిగేట్సులో చాలామంది వారి సీట్లకు తగిలించియున్న శ్రవణ యంత్రాలను ధరించి ఉంటారు. బహుశః తమ తోటి ప్రతినిధి ఇస్తూన్న ఉపన్యాసాన్ని వారు వింటూ ఉండి ఉండవచ్చు.

కాని సమావేశానికి హాజరయ్యేవారు అనేకదేశాలకూ, వివిధ భాషలకూ చెందినవారై ఉంటారుకదా. మరి ఆ ఉపన్యాసకుడు ఏం మాట్లాడుతున్నదీ వీరందరికీ ఎట్లా అర్థం అవుతుంది ?

శ్రవణయంత్రాలు, ఆరు పొజిషన్ల ఒక స్విచ్ కంట్రోలు, ప్రత్యేకంగా నియమితులయ్యే దుబాసీల ద్వారా ఇది సాధ్యం అవుతోంది.

ఐక్యరాజ్యసమితికి ఐదు అధికారభాషలు ఉన్నవి. అవి ఏమిటంటే— చైనాభాష, ఫ్రెంచి, రష్యన్, స్పానిష్, ఇంగ్లీషు భాషలు. ఒక ప్రతినిధి యీ ఐదుభాషల్లో ఏది మాట్లాడినా, దుబాసీలు వెంటనే తక్కిన నాలుగు భాషల్లోకి అనువాదం చేస్తారు. ఉపన్యాసాలు దుబాసీల చెవుల్లోకి ఏ ఒక్క భాషలో ప్రవేశించినా, వారి నోటివెంట మరో భాషలో బయటికి వస్తాయి.

ఈ అనువాదాలు అప్పుడు తీగద్వారా ఇయర్‌ఫోనులకు గొనిపోబడతాయి. వినే ప్రతినిధులు అధికారభాషలు ఐదింటిలో తమకి అర్థమయ్యే ఏ ఒక్క దానికైనా తమ ఇయర్‌ఫోనులను ట్యూనుచేసుకొని ప్రసంగాన్ని వినవచ్చును.

దుబాసీ అతి వేగంగా అనువాదం చేస్తూ ఉండటంవల్ల ఆ ఉపన్యాసం అతనే ఇస్తున్నట్లు అనిపిస్తుంది. అదిగాక ఉపన్యాసకుడు చెప్పే విషయంతో



ఐక్యరాజ్యసమితి
తాలూకు ఒక దుబాసి

రాను ఏకీభవించబోయేదిగాక, వక్త ఆశించేవిధంగా అతను ఆ ప్రసంగాన్ని ఆసక్తిగొలిపేదిగానూ, ఆకర్షవంతంగానూ చేయాలి.

ఒక్కొక్కప్పుడు ఉపన్యాసకుడు ఏదైనా లోకోక్తి వాడవచ్చు. దానిని మరో భాషలోకి అనువదించేస్తే అది అర్థవిహీనం కావచ్చు. ఉదాహరణకి, రష్యా దేశస్థుడు "ఒక సంఘటన జరిగితే జరుగవచ్చు" అని చెప్పటానికి "మరుగుజ్జువాడు పర్వతాగ్రమునుండి యీలవేసినప్పుడు" అని గనక అంటే, ఆ కార్యము జరగకపోవచ్చును అని అర్థం. ఆ సామెతే ఆంగ్లభాషలో చెప్పాలంటే - "చందమామ ఆకుపచ్చని జున్నుగా మారినప్పుడు" అని దుబాసీ చెప్పవచ్చును.

ఒక డెలిగేట్ ఇచ్చే ఉపన్యాసాన్ని ప్రపంచంలోని పలుప్రాంతాల నుంచి వచ్చిన మిగతా డెలిగేట్లందరూ అర్థం చేసుకుతీరవలసినంత ప్రాముఖ్యత దీనిలో ఏముంది ?

ఇందుకు సమాధానం మనకు ద్వితీయ ప్రపంచ సంగ్రామమే ఇస్తుంది.

# శాంతికై పరస్పరం పాటుపడటం

ద్వితీయ ప్రపంచ సంగ్రామం అతి అనర్థదాయకం, వినాశనకరం కావడంవల్ల మిత్రరాజ్యాల అధినేతలు వివిధదేశాలమధ్యా శాంతిని నెలకొల్పడానికి తగిన మార్గాన్ని అన్వేషించా లనుకున్నారు. 1945 లో ఏభై రాజ్యాలవారు తమ ప్రతినిధులను శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన సమావేశానికి పంపారు. అక్కడే ఐక్యరాజ్యసమితి స్థాపించబడింది. ఆయాదేశాలమధ్య యుద్ధానికి దారితీసే తగువులాటలను తొలగించడానికే యీ సంస్థ నెలకొల్పబడింది.

యుద్ధనివారణకై పనిచేయటానికి తీర్మానించుకోటం ఇదే మొదటిసారి కాదు. మొదటి ప్రపంచయుద్ధం ముగిశాక, నానారాజ్యసమితి ఏర్పడింది. కాని సమితికి చెందిన సభ్యరాజ్యాలవారు సాయుధముట్టడులను అరికడతామనే తమ ప్రతిజ్ఞలకు కట్టుబడి ఉండలేకపోయారు.

కెనడాదేశపు లెస్టరు పియర్సన్ ఆ సంఘానికి ఆ సంవత్సరం అధ్యక్షుడైనాడు. ఆయన ప్రారంభోపన్యాసంలో, ఎంతో ఎత్తూ, పొడవూ ఉన్న కార్యదర్శి కార్యాలయ భవనాన్ని "స్వర్గానికి చేతులు చాస్తూంది"అన్నారు. శాసనసభ సమావేశ సభాభవనాలు కుదిమట్టంగా, క్రిందుగా వ్యాపించి యున్నందున "మన పాదాలు దృఢంగా భూమిని అంటిపెట్టుకుని ఉన్నట్లుగా" అవి సూచిస్తున్నాయని అన్నారు. ఇదేవిధంగా ఐక్యరాజ్యసమితి భవనాలు కూడా సహజత్వాన్నీ, ఆశావాద ఆవశ్యకతనూ వెల్లడిస్తూ ఉన్నవి.

మీరు ఐక్యరాజ్యసమితి భవనాల బొమ్మలను చూసేఉంటారు. మీ అంతట మీరు ఐక్యరాజ్యసమితి భవనాలకు వెళ్ళి స్వయంగా చూసికూడా ఉండవచ్చును. తన పాదాలవద్దగల తక్కువ ఎత్తు భవనాలనుంచి అంబరాన్ని చుంబించేటట్లు నిటారుగా అతి నిర్మలంగా నిలబడియున్న గాజూ, ఉక్కూ నిర్మిత ఆకాశహర్మ్యము తన నీలం తెలుపూ జెండావలెనే ఐక్యరాజ్యసమితికి ఒక చిహ్నమైపోయింది.



1945 లో శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన మహాసభ సమావేశం

## నిబంధనావళి

ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వంగల అన్ని రాజ్యాలూ దాని నిబంధనావళికి కట్టుబడి ఉంటాయి. చరిత్రప్రసిద్ధిచెందిన పత్రాలలో ఐక్యరాజ్యసమితి నిబంధనావళి ఒకటి. దానిని అంతర్జాతీయ హక్కుల పత్రంగా కూడా పేర్కొంటూ ఉంటారు. ఈ ఐక్యరాజ్యసమితి నిబంధనావళిపత్రం 1945 అక్టోబరు ఇరవైనాలుగవతేదీన అమలులోనికి వచ్చింది. నాటినుండి ఆ రోజును ఐక్యరాజ్యసమితి దినంగా వ్యవహరిస్తూ ఉన్నారు.

ఈ పత్రము సభ్యత్వరాజ్యాలు అనుసరింపవలసిన నిబంధనలను నిర్ధారణచేస్తూంది. అది ఐక్యరాజ్యసమితియొక్క ఆశయాన్ని తెలుపుతుంది; ఐక్యరాజ్యసమితి చేయగలిగింది ఏమిటో, చేయలేనిది ఏమిటో నిర్వచిస్తుంది.

ఐక్యరాజ్యసమితియొక్క ముఖ్యోద్దేశాలు ఈ నాలుగూను :—

1. ప్రపంచం అంతటా శాంతిని నెలకొల్పడం, 2. ఏ దేశానికి ఆ దేశం సమాన హక్కులు కలిగి, తనను తాను పరిపాలించుకునే హక్కును కలిగి ఉన్నదన్న ప్రాతిపదికమీద వివిధ రాజ్యాలమధ్యా స్నేహసంబంధాలను అభివృద్ధిచేయడం, 3. ప్రపంచమంతటా ప్రజాకోటి జీవనస్థాయిని అభివృద్ధి చేయటానికి తోడ్పడటం, మానవ హక్కులనూ, సమస్త ప్రజానీక స్వతంత్రాన్నీ అభివృద్ధిచేయడానికి చేయూతనివ్వడం, 4. అన్ని రాజ్యాల వారూ ఒకచోట కలుసుకుని తమ సమస్యలను చర్చించుకుని పరిష్కరించుకునేందుకు వీలుగా ఒక స్థలాన్ని సమకూర్చడం.

సభ్యులపట్టిక రోజురోజుకూ పెరుగుతూనే ఉన్నది. మొదట్లో యాభయ్యొక్క మంది సభ్యులతో ప్రారంభమయిన ఐక్యరాజ్యసమితిలో యీనాడు నూటఎనిమిదిమంది సభ్యులు ఉన్నారు.

ఏ రాజ్యం గాని తనకి ఇష్టంలేకపోతే యు. యన్. లో చేరవలసిన అగత్యం లేదు. ఒకానొకరోజున ప్రపంచంలోని అన్ని రాజ్యాలూ ఐక్యరాజ్య సమితి సభ్యులుగా చేరతాయని మనం ఆశింపవచ్చును.

## ఐక్యరాజ్యసమితి శాఖలు

ప్రతిదేశమూ ఐక్యరాజ్యసమితి నిర్దేశించిన ముఖ్యోద్దేశాలప్రకారం మనుగడ సాగిస్తే మానవజాతి నివాసానికి ఈ ప్రపంచం స్వర్గతుల్యం అయి ఉండేది. కాని ప్రజలమాదిరే రాజ్యాలుకూడా తమ ఆశయాలకు అనుగుణ్యంగా ఎల్లప్పుడూ నడుచుకొనలేవు.

ఐక్యరాజ్యసమితికి తన లక్ష్యాలను అమలుపరచడానికి సహాయంచేసే ఎన్నో కమిటీలూ, కమీషన్లూ, కౌన్సిళ్లూ ఉన్నాయి. ఈ నిబంధనావళి పత్రంలో ఆరు ముఖ్యశాఖలు మాత్రమే సూచింపబడినవి.

1. సర్వసభ్యసమావేశం (జనరల్ అసెంబ్లీ)
2. భద్రతాసంఘం
3. ఆర్థిక, సాంఘిక సంఘం
4. ధర్మకర్తృత్వ సంఘం
5. అంతర్జాతీయ న్యాయస్థానం
6. ప్రధానకార్యదర్శి (సమితి) కార్యాలయం.

ఈ ఆరు ముఖ్యశాఖలూ ఐక్యరాజ్య సమితి యొక్క ఆదర్శములను అమలుపరచటానికి తోడ్పడుతున్నాయి.



# సర్వసభ్య సమావేశం

ఐక్యరాజ్యసమితియొక్క ప్రధానశాఖ సర్వసభ్యసమావేశం. అన్ని సభ్యత్వదేశాలూ ఇందులో ప్రాతినిధ్యం వహిస్తాయి. ఈ సర్వసభ్యసమావేశం సంవత్సరంలో మూడు నెలలపాటు తప్పనిసరిగా సమావేశమవుతూ ఉంటుంది. కాని అత్యవసర సమావేశాలు మాత్రం ఏ సమయంలోనైనా ఏర్పాటు చేసుకో వచ్చును.

ఉదాహరణకి, సూయజ్ విషమస్థితిలో తక్షణం శాంతిని నెలకొల్ప డానికి సర్వసభ్యసమావేశం సమావేశమయింది.

సూయజ్‌కాలువ మధ్యధరాసముద్రాన్ని ఎఱ్ఱసముద్రంతో కలుపుతూంది. ఈ సూయజ్‌కాలువ ఈజిప్టుదేశంలోనుంచి ప్రవహిస్తూంది. ఐతే అనేకదేశాల వారి నౌకలు దీనిద్వారా ప్రయాణం చేస్తూవచ్చాయి. లేకపోతే ఆఫ్రికాచుట్టూ తిరిగి రావల్సివస్తుందన్నమాట. 1956 జూలై నెలలో ఈజిప్టు ఈ సూయజ్ కాలువను జాతీయం చేసివేసింది. ఇది అంతకుపూర్వం ఫ్రెంచి, బ్రిటిష్ ప్రైవేటు కంపెనీలద్వారా నిర్వహింపబడింది. ఇప్పుడు ఈజిప్టు దేశస్థులే స్వయంగా నడుపుకుంటామని ప్రకటించుకున్నారు.

1956 అక్టోబరు ఇరవైతొమ్మిదవతేదీన ఇజ్రెయిల్ సాయుధసైన్యం ఈజిప్టు దేశపు సినాయ్ ద్వీపకల్పములోనికి ప్రవేశించింది. ఆ సమయానికి యీ సమస్య భద్రతాసమితి విచారణలో ఉన్నది. మూడురోజుల అనంతరం బ్రిటిష్, ఫ్రెంచి సైనికదళాలు సూయజ్ కాలువ ఉత్తరకొనకు వచ్చి చుట్టు ముట్టాయి. ఈ పోరాటం పెద్ద యుద్ధంగా పరిణమిస్తుందేమోననే భయం అంద రికీ కలిగింది.

సర్వసభ్యసమావేశం అత్యవసరంగా అప్పటికప్పుడు కలుసు కొన వలసివచ్చింది. వెంటనే ఇజ్రేయిల్, గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్సులు తమ పోరా టాన్ని విరమించి వారి వారి సైన్యాన్ని ఈజిప్టునుంచి తొలగించవలసినదని



సినాయ్ ద్వీపకల్పంలో 'సమితి అత్యావశ్యక సైన్యం' తరఫున యుగోస్లావియా సైనికులగ స్తీ

సమితి ఒత్తిడిచేసింది. ఐక్యరాజ్యసమితి వెంటనే అత్యవసర సైనికదళాన్ని సమకూర్చటానికి సభలో తీర్మానించింది. ఆ దళాన్నే "ఐక్యరాజ్యసమితి అత్యావశ్యకసైన్యం" అని అంటారు. చిన్నరాజ్యాలనుండి వచ్చిన సైనికులతో ఈ దళం ఏర్పడుతుంది. ఇది యుద్ధంచేసే సైనిక దళం కాదు; శాంతి స్థాపన దళం. ఇది ఇరుపక్షాల సమ్మతితోనూ పంపబడుతుంది.

కొద్దిరోజుల్లోనే పోరాటం ఆగిపోయింది. ప్రథమ "ఐక్యరాజ్యసమితి అత్యావశ్యకసైన్యం" ఇరుపక్షాలవారినీ వేరుపరచడానికి వచ్చిచేరింది. కొన్ని వారాలలోనే బ్రిటిష్, ఫ్రెంచి, ఇస్రెయిల్ సైనికులు తొలగింపబడ్డారు. ఐక్యరాజ్యసమితిచే శాంతి నెలకొల్పబడింది.

యుద్ధసమయంలో మునిగిపోయిన నౌకల మూలాన సూయజ్‌కాలువలో రాకపోకలకు అవరోధం ఏర్పడింది. ఈ అవరోధాలను తొలగించే చర్యలను తీసుకోవలసిందిగా సర్వసభ్య సమావేశం సమితి ప్రధాన కార్యదర్శిని ఆదేశించింది. డిసెంబరు ఆఖరుకి ఐక్యరాజ్యసమితికి చెందిన నౌకలు పనిలో ప్రవె

శించినవి. మూడునెలల అనంతరం, యీ కాలువ తిరిగి నౌకల రాకపోకలకు తెరువబడింది. ఆ తర్వాత, అంతకుపూర్వం సూయజ్‌కాలువపై ఆధిపత్యం వహిస్తూన్న కంపెనీతో ఈజిప్టు సమాధానానికి వచ్చి, ఇప్పుడు ఆ కాలువ కార్యకలాపాల నన్నింటినీ తానే స్వయంగా నిర్వహిస్తూ ఉన్నది.

ఈలోపుగా ఐక్యరాజ్యసమితి అత్యావశ్యక దళ సైన్యం ఇజ్రేయిల్, ఈజిప్టుల మధ్యనున్న సరిహద్దు పొడవునా అకాబాజలసంధి ముఖద్వారమందు, సినాయ్ ద్వీపకల్ప దక్షిణముఖాగ్రమున స్థావరముల నేర్పరచుకున్నారు. తత్ఫలితంగా ఇజ్రేయిల్, ఈజిప్టుల మధ్యనున్న సరిహద్దు ప్రాంతమంతా శాంతి నెలకొని అంతకుపూర్వం సదా సంభవించే పోరాటాలు మటుమాయం అయ్యాయి.

ఐదువేలమంది అత్యవసర దళ సైనికులతోనే ఐక్యరాజ్యసమితి శాంతిని పునరుద్ధరించగలిగింది. ఈ చిన్నదళానికి ఐక్యరాజ్యసమితిలోని అన్ని సభ్యత్వదేశాల ఆమోదమూ, నైతిక ఆధిపత్యమూ అండగా ఉన్నవి.

శాంతిని సుస్థిరంగా నెలకొల్పడానికి ఐక్యరాజ్యసమితి ఏమిచెయ్యగలిగిందో చెప్పడానికి సూయజ్ విషమపరిస్థితిని ఒక చక్కని ఉదాహరణగా పేర్కొనవచ్చును. ప్రపంచ ప్రజాభిప్రాయానికి ఎంతటి మహత్తరశక్తిగలదో ఇది తెలియజేసింది. ప్రపంచంలోని ఎన్నోరాజ్యాలకు ఆమోదకరంగాని కంటకప్రాయమైన చర్యకు దిగాలని ఏ దేశం కూడా ఉబలాటపడదు.

## సర్వసభ్యసమావేశ ఇతరకార్యకలాపాలు ఏమిటి?

ఐక్యరాజ్యసమితి యొక్క అన్ని వ్యవహార విషయాలతోనూ సర్వసభ్యసమావేశానికి సంబంధం ఉంటుంది. నూతన సభ్య రాజ్యాలను చేర్చుకుంటుంది. ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలను నిర్వహించే ప్రధాన కార్యదర్శిని భద్రతాసమితి సిఫార్సుమీద నియమిస్తుంది. మిగతాశాఖల సభ్యులను కూడా

ఎన్నుకుంటుంది. శాంతిభద్రతలకు సంబంధించిన సమస్యలను సైతం చక్క-బెడుతుంది. మరల యీసమావేశమే ఐక్యరాజ్యసమితి ఆదాయవ్యయములను నిర్ధారణచేస్తుంది.

సర్వసభ్యసమావేశం జరిపే సమావేశాలను 'సెషన్సు' లేక 'సభలు' అని పిలుస్తారు.

ప్రతిసంవత్సరం ఈ సమావేశం తన అధ్యక్షుని ఎన్నుకుంటుంది. నిబంధనావళిలో చెప్పకపోయినా, సర్వసాధారణంగా అధ్యక్షుడు 'చిన్న' లేక 'మధ్యరకపు' దేశాలనుండి ఎన్నుకోబడినవాడే గాని ఇంతవరకూ అగ్ర రాజ్యాలనుండి కాదు. అగ్రరాజ్యాలు ఏవంటే-

చైనా, బ్రిటన్, ఫ్రాన్సు,
అమెరికాసంయుక్తరాష్ట్రాలు, సోవియట్ యూనియన్.

సర్వసభ్యసమావేశం సభతీర్చి ఉండగా మీరు వెళ్ళి చూసినా, లేక టెలివిషన్‌లో చూసినా, ముగ్గురు వ్యక్తులు స్పీకర్ యొక్క బల్ల వెనుకగా ఒక ఎత్తయిన వేదికమీద కూర్చుని ఉండటం చూస్తారు. అధ్యక్షుడు మధ్యలో



హంగరీ సమస్యపై చర్చలో పాల్గొన్న ప్రధాన కార్యదర్శి డాగ్ హామర్‌షెల్డ్, అసెంబ్లీ అధ్యక్షుడు ఛార్లెస్ మాలిక్, ప్రధాన కార్యదర్శి నిర్వాహక సహకారి అండ్రూ డబ్ల్యు. కార్డియర్



కూర్చుని ఉంటాడు. ప్రధానకార్యదర్శి ఆయన కుడివైపున, నిర్వాహకసహ కారి, లేక ప్రధానకార్యదర్శియొక్క కార్యనిర్వహణ సహాయాధికారి ఆయన ఎడమవైపున కూర్చుంటారు.

సర్వసభ్యసమావేశంచే నిర్ణయింపబడవలసిన ఏ విషయం ఐనా సరే సర్వసాధారణంగా తీర్మానం అనే వ్రాతరూపంలో పెట్టబడుతుంది. సమావేశంలో ప్రతిపాదింపబడిన ముఖ్యమైన తీర్మానాలన్నీ గూడా ఓటుచేస్తున్న ప్రతినిధులలో మూడింట రెండువంతులమందిచే ఆమోదింపబడాలి.

ప్రతిసభ్యత్వదేశానికీ, అది ఎంత పెద్ద దేశమయినా సరే, ఒకే ఒక ఓటు ఉంటుంది. ఓటు తీసుకుంటున్నప్పుడు ప్రతినిధులను ప్రతిపాదనకి అనుకూలంగాగానీ, ప్రతికూలంగాగానీ ఓటుచెయ్యమంటారు. ఏ ప్రతినిధి దేశంగాని ఏ తీర్మానంపైనన్నా ఇష్టంలేకపోతే ఓటుచేయకుండానే ఉండవచ్చును. వారు గైరుహాజరు కావచ్చును. అంటే వారు అనుకూలంగాగానీ, ప్రతికూలంగాగానీ ఓటువెయ్యరు. ఒక తీర్మానానికి నలుబదిమంది అనుకూలంగానూ, ఇరువదిమంది ప్రతికూలంగానూ ఓటుచేసి, ఇరవైరెండుమంది ఓటు చేయకపోతే ఆ తీర్మానానికి అంగీకారముద్ర పడుతుంది. దానిని ఆమోదించటం అంటారు.

నిరాయుధీకరణపై రాజకీయసంఘం
ప్రతిపాదించిన తీర్మానానికి సభ్యులు
చేతులెత్తి ఓటుచేస్తున్నారు.

సర్వసభ్యసమావేశానికి చేయవలసిన పని చాలా ఉన్నందువల్ల, సర్వ సాధారణంగా మొదట్లో తన సమస్యలను అనేక ఇతర కమిటీలకు పంపు తుంది. ఈ కమిటీలు ఆ సమస్యను చర్చించి, అవసరమైనవాటిని అర్థంచేసు కోటానికి సమాచారాన్ని సేకరిస్తాయి. తర్వాత ఈ విషయంలో సర్వసభ్య సమావేశం నిర్ణయం తీసుకోవడానికి వీలుగా తమ సూచనలను యీ కమిటీలు అందజేస్తాయి.

ఒక ముఖ్య విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి. సర్వసభ్యసమా వేశం కడపటిసారిగా ఆమోదించిన తీర్మానాలు సభ్యత్వదేశాలకు సలహాలు మాత్రమే. చట్టరీత్యా వాటిని అమలు పరిచే మార్గం లేదు. ప్రపంచరాజ్యాల ప్రజాభిప్రాయానికి, జనవాణికి సర్వసభ్యసమావేశం ప్రాతినిధ్యం వహిస్తున్నది గావున యీ సలహాలకి ఎంతో సత్తా ఉన్నది. యథార్థానికి సర్వసభ్యసమావేశం ఒక్కొక్కప్పుడు 'ప్రపంచరాజ్యాల పట్టణ సమావేశం' గా పేర్కొనబడుతూ ఉంటుంది.

## ప్రతినిధులు - ప్రతినిధి వర్గాలు

ఐక్యరాజ్యసమితిలో దేశాలు మాత్రమే సభ్యులుగా ఉన్నాయని చెప్పాము. ఒక దేశము మాట్లాడటంగాని, ఏకార్యమన్నా చేయటంగాని తన ప్రతినిధిద్వారానే చేయగలదు. ఐక్యరాజ్యసమితికి చెందిన ప్రతిదేశం ఒక ప్రతి నిధివర్గాన్ని నియమించుకుంటుంది. ఈ ప్రతినిధివర్గానికి సర్వసాధారణంగా ఒక రాయబారి నాయకుడుగా ఉంటాడు. ఈ రాయబారి శాశ్వత ప్రతినిధిగా ఉంటాడు.

ఈ డెలిగేట్లను రిప్రజెంటేటివ్స్ అని కూడా పిలుస్తారు. ముఖ్య సమావే శాలలో, తరుచు ఒకదేశం యొక్క విదేశ వ్యవహారాల మంత్రిగాని, లేదా

ఆదేశపు ప్రధాన కార్యదర్శిగాని ప్రాతినిధ్యం వహిస్తారు. కొన్నిసందర్భాలలో ఆదేశ ప్రధానమంత్రో, లేక అధ్యక్షుడో ప్రాతినిధ్యం వహించవచ్చును.

ఐక్యరాజ్యసమితిలోని ప్రతి సభ్యత్వదేశం తన పదిమంది ప్రతినిధి వర్గంద్వారా ఓటుచేస్తుంది. ప్రతినిధివర్గంలో పదిమంది ఉన్నా ఓటుమాత్రం ఒక్కటే.

సర్వసభ్యసమావేశానికి హాజరయ్యే ప్రతినిధి సభలు జరుగుతున్న సమయంలో క్షణం తీరని పనిలో నిమగ్నుడై ఉంటాడు. ఆరోజు ప్రతినిధివర్గ సమావేశంతో ప్రారంభమవుతుంది. ప్రతినిధివర్గ నాయకుడైన విదేశ వ్యవహారాలమంత్రి ఇచ్చిన ఆఖరుక్షణపు ఆదేశాలు చర్చింపబడతాయి. ఆనాటి సభా కార్యక్రమానికి అవసరమయిన హంగులన్నీ స్థిరపరచుకుంటారు. ఆనాటి సభ పూర్తిఅయిన తర్వాత ప్రతి ప్రతినిధివర్గం వారి వారి దేశ రాజధానులకు నివేదికలను పంపుతారు.

## ఐక్యరాజ్యసమితిలోని రాజకీయవర్గాలు

ఒక విషయానికి అనుకూలంగాగానీ, ప్రతికూలంగాగానీ ఓటింగుద్వారా నిర్ణయించటం అనుకున్నంత సులభం ఏమీకాదు. సర్వసాధారణంగా ఒకే రకమైన అభిలాషలుగల రాజ్యాలు కలిసి ఓటు చేస్తాయి.

పశ్చిమరాజ్యాలు ఒక గ్రూపువలె సమిష్టిగా ఓటుచేస్తాయి. ఇవి యునైటెడ్‌స్టేట్సు, గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్సు. వీటితోబాటు వీటి మిత్రరాజ్యాలయిన మరి ముప్ఫయ్, నలభయ్ దేశాలుకూడా ఉన్నాయి.

తూర్పు రాజ్యాలను ఒక్కొక్కప్పుడు సోవియట్ కూటమిగాకూడా పేర్కొంటూ ఉంటారు. ఆ కూటమిలో తొమ్మిది రాజ్యాలు ఉన్నాయి. అవి సోవియట్ యూనియనూ, దానికి సంబంధించిన ఎనిమిది మిత్రరాజ్యాలూను. ఈదేశాలన్నీ చాలావరకూ ఒకేవిధంగా ఓటు చేస్తూంటాయి.



భద్రతాసంఘ సమావేశంలో ఏకాకిగా విదేశాంగ మంత్రుల్లో చివరివాడుగా సూయజ్ కాలువ సమస్యపై ప్రసంగిస్తున్న అమెరికా మంత్రి కి. జే. ఫాస్టర్ డల్లెస్.

అసెంబ్లీ భవనంలోని వసారాల్లో ప్రతినిధుల పిచ్చాపాటీ సంభాషణలు. నేల మీద పరచిన ఆ నగిషీతివాసి ఈక్వడార్ సమితికి బహూకరించింది.

ఇక పోతే ఏ పక్షానికీ చేరని తటస్థరాజ్యాలు కొన్ని ఉన్నాయి. ఈ రాజ్యాలు అటు పశ్చిమ రాజ్యాలతోనూ చేరవు; ఇటు తూర్పు రాజ్యాలతోనూ చేతులు కలపవు. ఇలా తటస్థంగా ఉండే రాజ్యాలు ఇరవై దాకా ఉన్నాయి. ఇవి ఒకప్పుడు పశ్చిమరాజ్యాలతో కలిసి ఓటుచేస్తాయి; మరొకప్పుడు తూర్పు రాజ్యాలతో ఓటు చేస్తాయి. ప్రాక్పశ్చిమ రాజ్యాలను ఎడముఖం పెడముఖం చేసే ప్రశ్నలు ఉత్పన్నమయినప్పుడు ఈ తటస్థరాజ్యాలు సాధ్యమైనంత వరకూ ఓటుచేయటం మానుకుంటాయి.

ఇంకా ఇందులో చిన్న చిన్న గ్రూపులు కూడా ఉన్నాయి. ప్రపంచ పథంలో ఇరుగుపొరుగున ఉన్న దేశాల అభిలాషలకు ఎంతో పోలిక ఉంటుంది. ఈ దేశాలను ప్రాంతీయ కూటములని అంటారు. ప్రపంచంలోని తమ ప్రాంతానికి సంబంధించిన సమస్యలను గురించి పరస్పరం ముచ్చటించు కోవడానికిగాను ఈ కూటముల సభ్యులు ప్రైవేటుసమావేశాలను ఏర్పాటు చేసుకుంటూ ఉంటారు.

ఈ ప్రాంతీయ రాజ్యాల కూటములలో కల్లా పెద్దది ఏషియా, ఆఫ్రికా రాజ్యాల కూటమి. పూర్వపు వలసరాజ్యాలు అనేకం "స్వతంత్ర" రాజ్యాలు అవుతూండటంచేత ఈ కూటమి రానురాను పెరుగుతూనే ఉన్నది. దానికి చెందిన చాలామంది సభ్యులు ఏ అగ్రరాజ్యాలతోనూ మిత్రత్వం నెరపడం లేదు. ఇలాంటివాటిని తటస్థరాజ్యాలని అంటున్నారు. ఏషియన్ - ఆఫ్రికన్ కూటమిలో ఇండియా ప్రముఖ సభ్యదేశం.

లాటిన్ అమెరికా కూటమిలో మధ్య, దక్షిణ అమెరికాదేశముల రాజ్యాలు ఉన్నాయి. ఇవన్నీకూడా యునైటెడ్ స్టేట్సుతోబాటు అమెరికన్ రాష్ట్రాల వ్యవస్థలో సభ్యత్వం కలిగిఉన్నాయి.

పశ్చిమ యూరపు కూటమిలో సోవియట్ కూటమునకు వెలుపలగల యూరపు దేశాలన్నీ కలిసి ఉన్నాయి. టర్కీ, యుగస్లావియాలు దీనిలోనే చేరి ఉన్నాయి.



సమితి ప్రధాన కార్యాలయంలో రెండవ నంబరు సభామండపం

ఈ కూటములలో ఏదీ కూడా చట్టరీత్యా ఐక్యరాజ్యసమితికి కట్టుబడి యున్నదికాదు. వీటికి కూటములుగా అధికార పరిగణన లేదు. ఆయా కూటమికి చెందిన రాజ్యాలు సర్వసామాన్యంగా ఒకవిధంగా ఓటుచేయటంవల్లనే ఆ విధమయిన పేరు వచ్చింది.

## భద్రతాసంఘం

భద్రతాసంఘం ముఖ్యంగా శాంతిసంరక్షణార్థం రూపొందించింది. సర్వసభ్యసమావేశం ప్రపంచ ప్రశ్నలనన్నీ వ్యవహరిస్తూండగా, భద్రతాసంఘం శాంతిభద్రతలకు సంబంధించిన ప్రశ్నలను మాత్రమే చేపడుతుంది. ఐక్యరాజ్యసమితిలోని అన్ని ప్రతినిధిరాజ్యాలు భద్రతాసంఘం చేసిన తీర్మానాలన్నిటినీ ఆమోదించడానికి, వాటిని అమలుజరుపడానికి అంగీకరించారు.

భద్రతాసంఘంలో పదకొండు సభ్యత్వరాజ్యాలు ఉన్నాయి. ఇందులో ఐదింటికి శాశ్వత సభ్యత్వం ఉన్నది. అవి :-

1. చైనా,
2. ఫ్రాన్సు,
3. సోవియట్ యూనియన్,
4. బ్రిటన్,
5. అమెరికా.





భద్రతా సంఘపు సభాస్థలి

మిగతా ఆరుగురుసభ్యులూ సర్వసభ్యసమావేశంద్వారా రెండు సంవత్సరాల కాలంపాటు ఎన్నుకోబడతారు.

సర్వసభ్యసమావేశంలాగా భద్రతాసంఘం క్రమపద్ధతిగా మీటింగులను జరుపదు. దానికిబదులు అవసరం వచ్చినప్పుడల్లా స్వల్పవ్యవధిలోనే సభ్యుల్ని సమావేశపరుస్తుంది. సభ్యత్వరాజ్యాలు భద్రతాసంఘంలో వరుసగా ఒకరి తరువాత ఒకరు నెలరోజులకొకరు చొప్పున అధ్యక్షులవుతూ ఉంటారు.

## శాంతిసంరక్షణ

ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాత ఇండొనీషియాలో పెద్ద ఎత్తున పోరాటం ప్రారంభం అయింది. ఆగ్నేయాసియా, ఆస్ట్రేలియాల మధ్య గుదిగుచ్చినట్లున్న ద్వీపముల సమూహంతో నిర్మితమైనదే యీ దేశం. ఇండొనీషియా చాలా సంవత్సరాలకాలం నెదర్లాండ్సు యొక్క అధీనంలోనే ఉండేది. ఐతే ఇప్పుడు స్వాతంత్ర్యం పొంది రిపబ్లిక్‌గా ప్రకటించుకుంది. నెదర్లాండ్సుకు ఆ ప్రాంతాన్ని వదలుకోటం ఏ మాత్రం ఇష్టంలేకపోయింది. కాబట్టి దాని సైన్యం కొత్తగా ఏర్పడిన రిపబ్లిక్ సైన్యంలో యుద్ధంచేయడం ప్రారంభించింది.

ఇండొనీషియాగురించి జరుగుతున్న పోరాటం భద్రతాసంఘం దృష్టిలోనికి తేబడింది. భద్రతాసంఘం తక్షణం యుద్ధం మానవలసిందని ఆన తిచ్చింది. వెంటనే ఇండొనీషియాలో శాంతి సంరక్షణకు పరిష్కారమార్గాన్ని కనిపెట్టడానికి ఒక కమిటీని ఏర్పాటుచేశారు.

రెండు సంవత్సరాలకిపైగా భద్రతాసంఘం యీ ఇండొనీషియా సమస్య గురించి కృషి చేసింది. నెదర్లాండ్సుయొక్క సైనికదళాన్ని ఉపసంహరింపమని కోరింది. అక్కడి పరిస్థితులను కనిపెట్టి చూడడానికి సైనిక పరిశీలకులను పంపింది. కొన్ని సమయాలలో పునః ప్రజ్వరిల్లిన పోరాటాగ్నిని ఆర్పివేయడానికి అది నడుం బిగించవలసివచ్చింది. రాజకీయ ఖైదీలను విడుదల

చేయవలసిందిగా ఆదేశించింది. ఈ పోరాటంతో సంబంధం ఉన్న రాజ్యాలను పిలిచి ఇష్టాగోష్ఠి సమావేశాన్ని జరిపింది. చివరకు ఇండొనీషియాకు స్వాతంత్ర్య ప్రదానం జరగవలెననీ, దానిని ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వ రాజ్యంగా చేర్చుకోవాలనీ కూడా సిఫార్సు చేసింది.

ఈ సమయంలో భద్రతాసంఘం శాంతియుతమైన పరిష్కారాన్ని అన్వేషించటానికి ఇండొనీషియా ప్రతినిధులూ, నెదర్లాండ్సు ప్రతినిధులూ పరస్పరం సమావేశమై చర్చలు జరపడానికి ఎంతో సహకరించింది. యు. యన్. ఇతర సందర్భాలలోవలెనే ఇక్కడకూడా పోరాటానికి స్వస్తి చెప్పించింది. శాంతియుతమైన పరిష్కారమార్గాన్ని సాధించడానికి తన పరపతినంతా ఉపయోగించింది.

భద్రతాసంఘం ఆధిపత్యంలో ఏ విధమైన సాయుధ సైనికదళాలూ లేవు. అక్కడ పరిస్థితులను పరిశీలించి నివేదించటానికి కొద్దిమంది సైనిక పరిశీలకులను మాత్రం పంపారు. సర్వసభ్యసమావేశంలాగే భద్రతాసంఘం యొక్క శక్తిసంపన్నమైన ఆయుధం ఐక్యరాజ్యసమితి ధర్మాధికారం తప్ప వేరేమీ లేదు.

ఐక్యరాజ్యసమితి శాంతిస్థాపనకై చేసిన అనేకప్రయత్నాలలో ఇండొనీషియాలో భద్రతాసంఘం సాధించినదానిని ఒక చెప్పుకోతగ్గ ఉదాహరణగా తీసుకోవచ్చును.

## వీటో అధికారం

సర్వసభ్యసమావేశపు ఓటింగుకూ, భద్రతాసంఘం ఓటింగుకూ తారతమ్యమున్నది. భద్రతాసంఘంలోని పదకొండు సభ్యత్వరాజ్యాలకీ ప్రాతినిధ్యం వహించేందుకు ఒక్కొక్క డెలిగేటే ఉంటాడు. ఒక్కొక్క సభ్యత్వరాజ్యానికీ ఒక్కొక్క ఓటు మాత్రమే ఉంటుంది.

ప్రతినిధులందరూ గుఱ్ఱపునాడామాదిరి అర్ధవలయాకారంగా ఉండే బల్లచుట్టూ కూర్చుంటారు. వ్యవహార సంబంధమైన విషయాలలోగానీ,

చూడవచ్చినవారికి సమితి భవనాలను చూపెడుతున్న సమితి ఉద్యోగి - సాంప్రదాయికమైన జపానుదుస్తుల్లో

లేదా కార్యకలాపాల నిర్వహణ విషయంలోగానీ నిర్ణయాలు ఏ ఏడు రాజ్యాల చేతనైనా తీసుకోబడుతాయి. తక్కిన విషయాలను తీర్మానించేటప్పుడు ఐదు శాశ్వత సభ్యత్వరాజ్యాలూ అధిక సంఖ్యానిర్ణయానికి అవసరమైన ఏడు ఓటింగు రాజ్యాలలోనూ తప్పక చేర్చబడవలసి ఉన్నది. ఏ శాశ్వతసభ్యుడు గాని తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేసినా అది వీటో అనబడుతుంది. బలప్రయోగం ఉపయోగించని ఏ తగాయిదాలోనన్నా ఒక శాశ్వత సభ్యత్వ రాజ్యం చిక్కుకున్నప్పుడు దానికి ఓటింగు హక్కులేదు.

అగ్రరాజ్యాలలోని ఏఒక్క రాజ్య అభిలాషలకూ ముప్పు వాటిల్లినట్లు భద్రతాసంఘం ఏ విధమైన నిర్ణయమూ తీసుకోకుండా నిరోధించేందుకే యీ

వీటో అధికారం యు. యస్. నిబంధనావళిలో చేర్చబడింది. ఇదేగనక సంభవిస్తే అతివిపత్కర పరిస్థితికి దారితీస్తుంది.

ఏ అగ్రరాజ్యాన్నీ దాని అభీష్టానికి విరుద్ధంగా బలవంతంచేసి ఏ పనీ చేయించడానికి వీలులేదు. ఒక వేళ అలాంటి ఒత్తిడే గనక అధికమైతే, యుద్ధానికి దారితీసే అనేక సంఘటనా పరంపరలను ఆ అగ్రరాజ్యం ప్రారంభించవచ్చును. అగ్రరాజ్యాలలో ఏ ఒక్కదానిమీదా అధికమైన ఒత్తిడి పేరుకునిపోకుండా నిరోధించేందుకు వీలుగా ఒకరకమైన రక్షణ కవాటంవలె యీ వీటో ఉపయోగపడుతూ ఉన్నది.

భద్రతాసంఘంలోని శాశ్వత సభ్యత్వరాజ్యాలన్నీ యీ వీటో అధికారం కలిగి ఉండటానికి సుముఖంగా ఉన్నారు. వారిలో ఏ ఒక్కరికీ యీ హక్కు వదలుకోవటానికి ఇష్టం లేదు. కాని పశ్చిమరాజ్యాలవారు - అంటే యునైటెడ్ సేట్సు, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు, వారి మిత్రరాజ్యాలు—సోవియట్ యూనియన్ యీ వీటో అధికారాన్ని దుర్వినియోగపరుస్తున్నట్లు ఆరో



సమితికి జపాను కానుకగా శాంతిగంటకు పట్టుకుచ్చులు సమర్పిస్తున్న జపాను విదేశాంగ వ్యవహారమంత్రి



ఫౌకాల్ట్ పెండ్యులం. నెదర్లాండ్సు బహూకరించింది.
ఇది భూభ్రమణాన్ని చూపెడుతుంది.



ఇండోనీషియా సమితికి బహూకరించిన బాలీ ప్రతిమల్లో ఒకటి. ప్రార్థనా ముద్రలో ఉన్న ఒక బాలీ పురోహితునికి ప్రతికృతి – శాంతికి ప్రతీకం.

పిస్తూన్నారు. ఇందుకు జవాబుగా సోవియట్ యూనియన్ పశ్చిమరాజ్యాలవారు అధికసంఖ్యాక బలాన్ని ఆకట్టుకుని ఉన్నారని అంటున్నది. ఆ విధంగా పశ్చిమ రాజ్యాలవారు "నిర్మితమైన"వీటోను కలిగి ఉన్నారని రష్యావారు అంటున్నారు.

1950 వ సంవత్సరంలో కొరియాలో యుద్ధం జరుగుతూ ఉన్నప్పుడు సర్వసభ్య సమావేశం "శాంతిస్థాపనకై సమైక్యత" అనే తీర్మానాన్ని ఆమోదించింది. శాంతికి ముప్పు వాటిల్లే సందర్భాలలో భద్రతాసంఘం తగిన చర్యలు తీసుకోకుండా వీటో అధికారం నిరోధించినప్పుడల్లా సర్వసభ్య సమావేశం ఒక ఆపన్నివారక సమావేశాన్ని ఏర్పాటుచేస్తుంది.

మొట్టమొదటి ఆపన్నివారక సమావేశం 1956 వ సంవత్సరంలో సూయజ్-హంగెరీ దేశాల విషమపరిస్థితిని గురించి చర్చించడానికి పిలువ బడింది. మరొకటి 1958 లో లిబనాన్‌లో విపత్తు వచ్చినప్పుడు ఏర్పాటుచేయ బడింది.

## బలవంతంగా అమలుజరుపు చర్య

శాంతిని కాపాడటానికి కావలసిన గట్టి చర్యలను తీసుకోవడానికిగానీ, చర్యలను అమలుచేయడానికిగానీ ఐక్యరాజ్యసమితి శాఖలన్నింటిలోనూ ఒక్క భద్రతాసంఘానికే అధిక శక్తి ఉన్నది. వర్తక వ్యాపార సంబంధాలను తెగతెంపులు చేసుకోవడంలాంటి శాంతియుతమైన విధానాలద్వారా యీ అమలు జరుపు చర్య తీసుకోబడుతుంది. అవసరమయితే సైనిక బలాన్ని ఉపయోగించి దానిని సాధిస్తుంది.

1950 వ సంవత్సరంలో భద్రతాసంఘం మొట్టమొదటిసారిగా సైనిక చర్యను సిఫార్సు చేసింది. ఉత్తర కొరియా ముట్టడిని తిరగగొట్టడానికిగాను దక్షిణ కొరియాకు సైనికసహాయం చేయవలసిందిగా ఐక్యరాజ్యసమితి సభ్యులకు అది సలహానిచ్చింది.

కొరియా యుద్ధంలో సమితి జండాక్రింద పోరాడడానికి పదహారు రాజ్యాలు సేనలను పంపాయి.

అవసరమైనప్పుడు ఉపయోగించుకునేందుకు వీలుగా భద్రతాసంఘానికి ఒక అంతర్జాతీయ పోలీసుదళాన్ని నిబంధనావళి సమకూర్చిపెట్టింది. ఐక్యరాజ్యసమితికి స్వంతంగా సాయుధ సేనలు లేనందువల్ల, యు. యన్. సభ్యత్వ దేశాలతో భద్రతాసంఘం ప్రత్యేక సైనిక ఒప్పందాలు చేసుకోవలసిందిగా నిర్ణయింపబడింది. ఈ ఒప్పందం ప్రకారం భద్రతాసంఘం యొక్క అభ్యర్థనను అనుసరించి సభ్యత్వరాజ్యాలు సైనిక పటాలాన్నీ, సైనికసహాయాన్నీ సరఫరాచేస్తాయి. ఏది ఎట్లా ఉన్నా భద్రతాసంఘంలోగల శాశ్వత సభ్యులు ఎవరు, ఏరకమైన, లేదా ఎంతమంది సాయుధసైనికులను పంపాలి అనే విషయంలో ఏకాభిప్రాయం చూపించనందున, ఈ ఉద్దేశం క్రియారూపం దాల్చనేలేకపోయింది.

ఐనప్పటికీ సర్వసభ్యసమావేశం అంతర్జాతీయ శాంతిదళాన్ని—ఐక్యరాజ్య అత్యావశ్యకదళం లాంటిది—సృష్టించగలదు. ఐక్యరాజ్యసమితి శాంతి

దళం ఏరాజ్యంలోనైనా ప్రవేశించడానికిగానీ, అక్కడ నిలవగలగడానికిగానీ ఆ రాజ్య అనుమతిని ముందుగా తీసుకోవటంవల్లనే అది సాధ్యమౌతుంది. ఈజిప్టు విషయంలో ఐక్యరాజ్యసమితి అత్యవసరదళం అక్కడ పనిచేయ డానికి పూర్వం ఈజిప్టు ప్రభుత్వం తన అనుమతినివ్వవలసి వచ్చింది.

## వివిధశాఖలూ శాంతిని ఎలా సంరక్షిస్తున్నాయి?

శాంతి సంరక్షణకు ప్రధాన పహరాదారు భద్రతాసంఘమే ఐనప్పటికీ సర్వసభ్యసమావేశం కూడా అంతర్జాతీయ శాంతి భద్రతలకు సంబంధించిన ఏ సమస్యనయినా చర్చించి, అలాంటి ఏ విషయంలోనైనా సిఫార్సులను చేయ వచ్చును.

ఈవిధంగా ఏదేశమైనా తమఫిర్యాదులను ఆలకించడానికి భద్రతా సంఘాన్నిగాన్నీ, లేక సర్వసభ్య సమావేశాన్నిగానీ ఎంచుకోవడానికి సాధ్య మౌతున్నది.

సర్వసభ్యసమావేశం సిఫార్సులు మాత్రమే చేయగల్గినా, భద్రతా సంఘం ఐక్యరాజ్యసమితి సభ్యత్వరాజ్యాలన్నీ కట్టుబడిఉండే నిర్ణయాలు తీసుకో గలిగినా యీ రెంటిలో ఎక్కువ తేడా ఏమీలేదు. ఐక్యరాజ్యసమితియొక్క ధర్మాధికారం, ప్రపంచ ప్రజాభిప్రాయ మనే ఒత్తిడి, ఐక్యరాజ్యసమితి తీర్మా నాన్ని పాటించడానికి వివిధరాజ్యాల సంసిద్ధత—భద్రతాసంఘ నిర్ణయాన్ని వలెనే సర్వసభ్యసమావేశ తీర్మానాన్ని గూడా శక్తివంతం చేస్తున్నాయి.

ఈరెండు శాఖలలో ప్రతి ఒక్కటీ కూడా శాంతిని భగ్నపరిచే అనేక విషయాలను చక్కదిద్దాయి. ఫిర్యాదుగల దేశం ఏ శాఖకి తెలియజేసుకుంటే తనకి అనుకూలంగా ఆ విషయం పరిష్కారం అవుతుందని అనుకుంటుందో ఆ శాఖకే పోతుంది.

భద్రతాసంఘంలో వీటో అధికారం ఉపయోగింపబడినప్పుడు ఆ కేసును సర్వసభ్యసమావేశానికి బదలాయించవచ్చును. అట్లా అనేకసార్లు జరిగింది.

## సమస్యను పరిష్కరించడం ఎట్లా ?

ఏ సమస్యనైనా భద్రతాసంఘానికి గాని, సర్వసభ్య సమావేశానికిగాని ఆయాదేశాలు తీసుకుపోవచ్చునుగాని, వ్యక్తులు తీసుకువెళ్లడానికి వీలులేదు. ఒకదేశం దాని సమస్యను యీ రెండు ప్రధానశాఖలలో ఏ ఒక్కదానికైనా తీసుకుపోవడానికి నిర్ణయించుకున్నప్పుడు ఆ సమస్యను చర్చనీయాంశాలలో చేర్చమని కోరుకుంటుంది. అంటే ఆ చెప్పదలచుకున్న విషయం వ్రాత రూపంలో పెట్టిన తరువాత ఆ శాఖవారు దానినిగురించి విచారించాలో లేదో తీర్మానిస్తారు.

ఏశాఖకైతే యీ సమస్య అప్పగించబడిందో ఆ శాఖ వినడానికి అంగీకరిస్తేతప్ప అప్పటిదాకా దాని విచారణకే అవకాశం ఉండదు. ఇది జరిగిన తరువాత ఆ సమస్యలో ఏ రాజ్యాలుగనుక చిక్కుకుని ఉన్నాయో, ఆ దేశాల ప్రతినిధులు వారి అభిప్రాయాలను తెలియజేస్తారు. ఈ సమస్యా పరిష్కార మార్గాలను వెల్లడించే తీర్మానాలను ఏ సభ్యదేశమైనా సూచింపవచ్చును.

అనేక సమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించటం సులభసాధ్యం కాదు.ఐక్యరాజ్యసమితి దృష్టిలోనికి ఒక సమస్య రావడానికి పూర్వం దానికి సుదీర్ఘమైన, సంక్లిష్టమైన నేపథ్యం ఉండి ఉంటుంది. ఏ సమస్యగాని సంపూర్తిగా సవ్యంగాకాని, అపసవ్యంగాగాని ఉండటం అసంభవం. సాధారణంగా అటువంటి చిక్కుసమస్యలను వేర్వేరు అంచెలుగా పరిశీలించి సుదీర్ఘమైన చర్చలు కొనసాగించవలసివస్తుంది.

## ప్రసంగప్రాముఖ్యత

ఒక్కొకసారి ప్రసంగాలూ, చర్చలూ అంతులేకుండా సాగిపోతున్నట్లుగానే అనిపిస్తాయి. మరికొన్ని సమయాల్లో వాగ్వివాదాలు ఎంతో కటువుగా కూడా ఉంటాయి. అయినప్పటికీ, ఒకప్పుడు ఒకానొక ప్రతినిధి అన్నట్లు,

"యువకులు యుద్ధంలో మరణించటం కన్నా, వయసుమళ్లిన యీరాజకీయ వేత్తలకు వాగ్వివాదాలలో రాచకురుపులు రావడం మేలు."

ఎడతెగని సంభాషణలవల్ల అప్పటి ఉద్రిక్తత చల్లబడటమే కాకుండా పరస్పర అభిప్రాయాలను వెల్లడించుకోవటంవల్ల ప్రయోజనకరమైన చర్యను తీసుకునే అవకాశం ఏది ఉన్నా అది వెలుగులోనికి వస్తుంది. ఒకానొక పరిస్థితిని గురించి ఎనభై దేశాలు వారివారి అభిప్రాయాలను వెల్లడించేలోగా ప్రపంచాభిప్రాయం బయటపడుతుంది. ఒకదేశంయొక్క ప్రవర్తనను ప్రభావితం చేయడంలో ప్రపంచ అభిప్రాయానికి గల శక్తి అపారమైనది.

దీనికితోడు, ఆయాదేశాలు తాము అనుసరింపదగిన సూచనలను తయారుచేసుకొనడానికిగాను, వాగ్వివాదాలకి యింత సమయం వెచ్చించడం అవసరమే అవుతుంది. ప్రతినిధులు ప్రతివిషయాన్నీ అతిజాగ్రత్తగా ఆలోచింపవలసి ఉంటుంది. ఆ విషయం మిగతాపరిస్థితులపై ఏ ప్రభావం కలిగి ఉండేదీ కూడా వారు ఊహించవలసిఉంటుంది.

ఇంకా ఎన్నో కారణాలను తరచి చూడవలసి ఉంటుంది. మిగతా ఐక్యరాజ్యసమితిసభ్యులు అందరి అభిప్రాయాలను వారు ఏవిధంగా భావిస్తున్నదీ తెలుసుకోవాలి. ఒక్కొక్క ప్రభుత్వంమీదా స్వదేశ విదేశాలలోని ప్రజల రకరకాల అభిప్రాయా లనే ఒత్తిళ్ళు ఉండనే ఉంటాయి. వీటన్నింటిని బట్టి ప్రతి చర్యా అమలులోనికి తెచ్చేముందు, అతిజాగ్రత్తగా, విపులంగా తెలుసుకోవాలి. ఇందులో ఆశ్చర్యకరమైన సంగతి - తీర్మానాలు చేయుటకై దీర్ఘవాగ్వివాదాలు, కాలవ్యయం కావడం కాదు, ఒక్కసారి వీలైనంత త్వరలో తీర్మానాలు చేసెయ్యటమే.

## ఏమిటి చేయడం?

ఐక్యరాజ్యసమితి అనేకమార్గాలలో చర్య తీసుకోగలదు. ఒక్కొక్కప్పుడు సర్వసభ్యసమావేశం వివిధ దేశాలూ తమ మధ్య గల విభేదాలను పర



యుద్ధంలో భర్తలను కోల్పోయిన యువతులకు పనిపాటులు చూపి వారికి జీవనాధారం చూపించడానికీ, వారిపిల్లలకు తిండితీర్థాలిచ్చి పెంచిపోషించడానికీ యు. యన్. కొరియాపునరుద్ధరణ సంస్థవారు (అంక్రా) ఇలాంటి కేంద్రాలు నడిపారు. యుద్ధపు తాకిడి ఫలితాలనుండి కోలుకోవడానికి ఇది కొరియా ప్రజలకు చాలా తోడ్పడింది.

స్వరం సరిదిద్దుకుపోగలరనే నమ్మకాన్ని వెల్లడిస్తుంది. అనేకరకాల పనులను కొనసాగించడానికి కొన్ని సమయాలలో కమిషన్లనూ, కమిటీలనూ ఏర్పాటు చేస్తూ ఉంటుంది. వారు ఆ సమస్యకు సంబంధించిన అన్ని విషయాలను కనిపెట్టి సిఫార్సులు చేయాల్సి ఉంటుంది. లేదా ఒక విషమపరిస్థితిని ఓ కంట కనిపెట్టి ఉండాలి. వీరు సంధిషరతులు సక్రమంగా పాటించబడేటట్లు పర్యవేక్షణ చేయడం, లేదా విభేదాలను స్నేహపూర్వకంగా పరిష్కరించుకునేందుకు సూచనలు ఇవ్వడం చేస్తారు.

కల్లోలితప్రాంతంలో చట్టసమ్మతంగాని చర్యలు కొనసాగకుండా చూడడానికి సైనికపరిశీలకులు పంపబడతారు. వేర్వేరు సమయాలలో భద్రతా సంఘంకాని, సర్వసభ్యసమావేశంగాని గ్రీసుకు - పాలస్తీన్‌కు - ఇండొనీషియాకు - కొరియాకు - లెబనాన్‌కు సైనికపరిశీలకులను పంపాయి.

వివాదగ్రస్తదేశాలు ఐక్యరాజ్యసమితి అనుసరింపదలచుకున్న తీర్మానాలకు అంగీకరింపకపోతే శాంతిసంరక్షణకై వాటిని అమలుజరపక తప్పదని కూడా హెచ్చరికచేస్తుంది. అంతకుముందే పోరాటంగనుక కొనసాగుతున్న పక్షంలో వెంటనే యుద్ధవిరమణ చేయమని ఆదేశించటమే మొదటిమెట్టు.

కొరియా విషయంలో ఐక్యరాజ్యసమితి అన్నిసభ్యత్వరాజ్యాలను దక్షిణకొరియాకు సైనికమైన, తదితరమైన సహాయం ఇవ్వమని కోరింది. ఉత్తరకొరియాకు, కమ్యూనిస్టుచైనాకు ఎటువంటి సహాయం చేయవద్దని కూడా చెప్పింది.

## కొరియా

రెండవ ప్రపంచ యుద్ధానంతరం కొరియా దక్షిణభాగాన్ని అమెరికా సైన్యము, ఉత్తరకొరియాని సోవియట్ సైన్యము ఆక్రమించుకున్నవి. ఈ సైన్యాలు కొరియాదేశంలో ఒక యుద్ధసమయ అంగీకారప్రకారం నిలపబడినవి. త్వరలోనే కొరియా స్వాతంత్ర్యం సంపాదించుకొని స్వేచ్ఛగా ఉండగలదని అందరూ ఆశించారు.

ఇంతలో ఎట్లాగైతేనేం, రెండు వేర్వేరు ప్రభుత్వాలూ కొరియాలో వృద్ధిచెందాయి. వాటిని ఉత్తరకొరియా, దక్షిణకొరియాలు అంటారు. ఐక్యరాజ్యసమితి సలహాప్రకారం అమెరికా, సోవియట్ దేశాల సైనికదళాలు వైదొలగవలసి ఉంది. అమెరికన్ సైనికులు వైతొలగటమే ఐక్యరాజ్య సమితి కమిషన్ గమనించిందికాని, సోవియట్ సైన్యాలు తొలగడంమాత్రం అది చూడలేదు.

1950 సంవత్సరం జూన్ నెలలో ఉత్తర కొరియా సైనికులు విభజన రేఖను దాటి దక్షిణకొరియామీద దాడిచేశారు. తీవ్రంగా పోరాటం ప్రారంభమయింది. భద్రతాసంఘం వెంటనే ఉత్తరకొరియా పోరాటాన్ని నిలిపివేసి


మంచూరియా
ఉత్తర
కొరియా
సమితి
యుద్ధ విరామ రేఖ
ప్యాంగ్యాంగ్
38 వ అక్షాంశ రేఖ
సియోల్
దక్షిణ
కొరియా
పసుపు
సముద్రము
జపాన్
సముద్రము
పూసాన్
0
200
మైళ్లు

సైన్యాలను తమ సరిహద్దుప్రాంతానికి తరలింపవలసిందిగా పట్టుబట్టింది. ఉత్తరకొరియా యీ ఆదేశాన్ని పెడచెవినిపెట్టినప్పుడు భద్రతాసంఘం, దక్షిణ కొరియాకు సహాయంచేసి ఉత్తరకొరియనుల దండయాత్రను పూర్తిగా అరికట్టవలసిందిగా ఐక్యరాజ్యసమితి సభ్యత్వరాజ్యాల నన్నింటినీ కోరింది.

నలభై దేశాలూ ఆహారం, ధనం వగైరా సరఫరాచేసి దక్షిణకొరియాకు సహాయం చేశాయి. దక్షిణకొరియాకు అండగా ఉండటానికి పదహారు రాజ్యాలు సైనిక బలాన్ని పంపాయి. దాడిచేసినవారిపై పోరాటం సాగించిన వారిలో మొదటివారు అమెరికాదేశపు సైనికులే. ఐక్యరాజ్యసమితి సంయుక్త సైనికదళాలు అమెరికా ఆధ్వర్యంక్రింద ఉంచబడినవి. ఐక్యరాజ్యసమితి పతాకంక్రిందనే యీ సైన్యాలు పోరాటం సాగించినవి.



ఉత్తరకొరియాతో చేతులు కలిపి కమ్యూనిస్టుచైనా వాలంటీర్లు పోరాటం కొనసాగించగానే యు. యస్. దళాలు ఉత్తరకొరియా సైన్యాలను వెనుకకు తరిమివేసినవి. ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశం కమ్యూనిస్టు చైనా దండయాత్రదళాల్ని వెనుకకు పిలువవలసిందిగా కోరింది.

పోరాటము నిర్విరామంగా కొనసాగి, ఉత్తర, దక్షిణకొరియాలను విభజించే మొట్టమొదటి సరిహద్దు రేఖా ప్రాంతముచుట్టూ సందిగ్ధపరిస్థితి ఏర్పడింది. 1951 జూలైలో ఐక్యరాజ్యసమితి సైన్యాల ప్రతినిధులు, కొరియన్ ప్రజాసైన్యము చైనా ప్రజావాలంటీర్లమధ్య శాంతిసంభాషణలు ప్రారంభ మయినవి. రెండుసంవత్సరాల అనంతరం సంధిపత్రంమీద సంతకాలు చేయబడినవి.

ఈ మూడేండ్ల పోరాటంలో ఇరుపక్షములందూ వేలాదిజనం మరణించారు. ఎందరో గాయాల పాలైనారు. మరెందరో మటుమాయమయినారు. దాడిచేసినవారు వెనుకకు తరిమికొట్టబడినారు. దక్షిణకొరియా సంరక్షింపబడింది. ప్రపంచ చరిత్రలోనే ప్రప్రథమంగా అంతర్జాతీయ సైనిక బృంద సహాయంతో ప్రపంచశాంతి సంస్థాపనసంస్థ ఒకటి విజయవంతంగా ఒక రాజ్యాన్ని సాయుధ దండయాత్ర బారినుండి సంరక్షించింది.

## పాలస్తీనా

మొదటి ప్రపంచ యుద్ధానంతరం గ్రేట్‌బ్రిటన్ పాలస్తీనాని ఒక ధర్మకర్తృత్వ ఒడంబడికక్రింద పరిపాలించింది. పాలస్తీనా రాజ్యంయొక్క స్వాతంత్ర్యసమస్య చిక్కులపాలైంది. పాలస్తీనా దేశంలో నివసిస్తూన్న అరబ్బులు, యూదులు అనే రెండు తెగల ప్రజలమధ్య ప్రజ్వరిల్లుతూన్న పోరాటాలు కారణంగా పాలస్తీనా స్వాతంత్ర్యప్రదాన సమస్య జటిలమై పోయింది. ఇరుతెగలవారు ఆ రాజ్యాన్ని పాలించే హక్కు తమకే గలదని వాదించటం ప్రారంభించారు.

1947 వ సంవత్సరంలో గ్రేట్‌బ్రిటన్ ఈ పాలస్తీనా సమస్యని ఐక్యరాజ్యసమితికి తెలియజేసింది. పాలస్తీనాని రెండు స్వతంత్రప్రతిపత్తిగల

జ్యూయిష్, ఆరబ్ రాజ్యాలుగా విభజించవలెననీ, జెరూసలేంనందు అంత ర్జాతీయ పరిపాలనా వ్యవస్థ ఏర్పడాలనీ సర్వసభ్యసమావేశం నిర్ణయించింది. సరిహద్దురేఖలుకూడా సూచింపబడినవి.

ఐక్యరాజ్యసమితియొక్క పథకానికి యూదులు అంగీకరించారు. ఆరబ్బులకుమాత్రం యీ పథకం ఏమాత్రం సంతృప్తికరంగా ఉండనందున నిరాకరించారు. దొంగచాటుపోరాటం ప్రారంభమయింది. పరిసర ఆరబ్బు దేశాలు పాలస్తీనాలోగల ఆరబ్బులకు సహాయార్థం సైన్యాలను పంపిస్తామని చెప్పారు. ప్రపంచం అంతటా గల యూదులు పాలస్తీనా యూదులకు తోడ్పడ గలమని ముందుకొచ్చారు. పాలస్తీనాలో ఏక్షణంలోనైనా యుద్ధం ప్రారంభ మయ్యే పరిస్థితి ఏర్పడింది.

1948 మేనెల పధ్నాలుగవతేదీన పాలస్తీనానుండి బ్రిటిష్‌వారు వైదొలగారు. ఐక్యరాజ్యసమితి సిఫార్సుచేసిన ప్రాంతంలో యూదులు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. ఈ కొత్తరాజ్యానికి ఇస్రేయిల్ అని నామకరణం చేశారు. మరుసటిరోజున చుట్టూగల ఆరబ్బుదేశాలనుండి సైన్యాలువచ్చి ఇస్రేయిల్ రాజ్యాన్ని చుట్టుముట్టాయి. వెంటనే భద్రతాసంఘం యీ విషయాన్ని చేపట్టింది. వెంటనే, పోరాటాన్ని ఆపివేయవలసిందిగా కోరింది. సమితి చివరకు ఒక సంధిని ఏర్పాటుచేసింది. పాలస్తీనాకి సైనిక పరిశీల కులు పంపబడినారు. అప్పుడప్పుడు అక్కడ పోరాటం మళ్ళీ తల ఎత్తుతూనే



సమితి తరపున పాలస్తీనాలో చేసిన సేవలకై 1950 లో నోబెల్ శాంతి బహుమతి పొందిన రాల్ఫ్ జె. బంచ్

వచ్చింది. కాని ఐక్యరాజ్యసమితి వెంటనే యీ పోరాటాలను నిలిపివేయ గలుగుతూవచ్చింది. చివరకు 1949 వ సంవత్సరంలో సంధిషరతులకు ఇజ్రేయిల్ రాజ్యం చుట్టూగల యీజిప్టు, జోర్డాన్, లెబనాన్, సిరియా మొదలగు అరబ్ దేశాలతోబాటు సంతకముచేసినది.

ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి కార్యాలయంలో పనిచేసే రాల్ఫ్ బంచ్ అనే అమెరికా దేశస్థుడు ఇజ్రేయిల్, అరబ్ దేశాలమధ్య తాత్కాలిక సైనికసంధి పొసగడానికి అవిరామకృషి సలిపి కృతకృత్యుడైనందుకుగాను నొబెల్ శాంతి బహుమతిని పొందాడు. ఇంకా శాంతి సమాధానపత్రము మీద సంతకములు కాలేదు. అప్పుడప్పుడు సరిహద్దులపొడవునా కాల్పులు జరుగు తూనే ఉన్నాయి. పరిష్కారంకాని సమస్యలలో పాలస్తీనా యుద్ధకారణంగా కాందిశీకులై బయలువెడలిన అరబ్బుల సమస్య ఒకటి. శరణాగతులైన అరబ్బులు ఇంకా శిబిరాలలో ఉంటూ ఉన్నారు. ఐక్యరాజ్యసమితి వారికి సహాయము చేస్తూ ఉన్నది. అపరిష్కృతంగా నిలిచిపోయిన సమస్యలలో ఇజ్రేయిల్ నౌకలను సూయజ్ కాలువగుండా పోనిచ్చే ప్రశ్న ఒకటి. ఇప్పుడు యీ నౌకలు అక్వాబా అఖాతముద్వారా ప్రయాణముచేయునప్పుడు ఈజిప్టు వీటిని సూయజ్ కాలువద్వారా పోనివ్వకుండా నిషేధించింది. తిరిగి పోరాటాలు తల ఎత్తకుండా ఐక్యరాజ్యసమితి అతిజాగ్రత్తగా పరిస్థితిని ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉంటుంది. సూయజ్, సినాయ్ ప్రాంతాలలోని పోరాటాన్ని అకట్టడానికిగాను 1956 లో సృష్టించబడిన ఐక్యరాజ్యసమితి అత్యవసర సైన్యము ఆ ప్రాంతంలో శాంతిని సంరక్షించడానికి ఎంతో సహాయం చేసింది.

## రాజీమార్గాన్ని వెతకడం

ఐక్యరాజ్యసమితి ముఖ్యశాఖలయిన సర్వసభ్యసమావేశమూ, భద్రతా సంఘమూ రెండూ కూడా తగాదాల్లో చిక్కుకున్న ఇరుపక్షాలకూ అంగీకార

ఈజిప్టు ఇజ్రేయిలులమధ్య మహా కలవర ప్రాంతమైన గాజారంగంలో యునెఫ్ తరఫున కావలినిలిచిన డేనిష్ పహారాదారు



యోగ్యమైన రాజీమార్గాన్ని కనిపెట్టడానికి ప్రయత్నిస్తాయి. ఇరుపక్షాలూ తమ కోర్కెల్లో కొన్నింటిని విడనాడుకోవడానికి అంగీకరిస్తే దానిని రాజీపడవం అని అంటారు. ఐక్యరాజ్యసమితి ప్రారంభించిన మొదటి సంవత్సరాలలో సర్వసభ్యసమావేశమూ, భద్రతాసంఘమూ సమాధానమార్గాలను వెతకటానికి కమిషన్లని ఏర్పాటుచేస్తూ ఉండేవి. ఇటీవల యీపనికై ఐక్యరాజ్యసమితి చాలావరకు ప్రధానకార్యదర్శిమీదనే ఆధారపడుతూన్నది.

ఈ ప్రధాన కార్యదర్శి తగాదాపడుతూన్న ప్రతినిధివర్గాలతో తెరచాటు మాదిరి వ్యవహరించవచ్చును. అంతేగాకుండా ఆయన ప్రభుత్వాధినేతలతో కూడా వ్యక్తిగతంగా సంప్రదింపులు సాగించవచ్చును. ఈ విధంగానే కొరియా యుద్ధానంతరం కమ్యూనిస్టు చైనాలో బందీకృతులైన అమెరికన్ సైనికులు విడుదలకావడానికి ఆయన సహాయం చేశాడు. సూయజ్ విషమసమయం లోనూ, ఇంకా అనేక యితర సందర్భాలలోనూ తనయొక్క పలుకుబడిని ఆయన నేరుగా వినియోగించాడు.

## నిరాయుధీకరణ

సర్వసభ్యసమావేశమూ, భద్రతాసంఘమూ రెండూ కూడా ప్రపంచ దేశాలు అన్నింటిచేతా ఆయుధ విసర్జన చేయటానికి సమ్మతింపజేయాలని శతవిధాల ప్రయత్నించాయి. ఈ ఆశయాన్ని ఆచరణలో పెట్టడానికి అనుస రించవలసిన పథకాలను రూపొందించేందుకుగాను నిరాయుధీకరణ కమీషన్ సృష్టించబడింది.

ఐక్యరాజ్యసమితియొక్క ముఖ్యాశయాలలో ఆయుధసేకరణ పోటీని ఆపివేయటం ఒకటి. అనేకదేశాలు ఆయుధ ఉత్పత్తి కార్యకలాపాలకై పోటీ పడి విపరీతంగా ధనం ఖర్చుపెట్టకుండా ఉంటే మానవజీవితాలను సుఖప్రదం చేయటానికి మరింత ఎక్కువకాలమూ, శక్తీ, ధనమూ వినియోగించవచ్చును.

ఓం ప్రథమంనించే ఐక్యరాజ్యసమితి పరమాణు ఉదజని బాంబులను నిషేధించటానికి ప్రయత్నిస్తూనే ఉన్నది. అంతేగాకుండా ఒక సమంజసమైన



అణుశక్తియొక్క శాంతిప్రయోజనాలనుగురించి 1958 లో జినీవాయందు (స్విట్జర్లాండు) జరిగిన రెండవ సమితి అంతర్జాతీయ మహాసభ. 69 రాజ్యాలనుంచి దాదాపు 4000 మంది శాస్త్రజ్ఞులు వచ్చి యిందులో పాల్గొన్నారు.

నియంత్రణావిధానంక్రింద, ఆయాదేశాలు తమ సాయుధసేనలను తగ్గించుకోవడానికిగూడా ప్రయత్నించింది.

ఈ సమస్య చాలా జటిలమైనది. ప్రతిదేశ భద్రత ప్రమాదకరమైన పరిస్థితిలోనే ఉండటంవల్ల వివిధరాజ్యాలమధ్యా పూర్తిగా భయమూ, అపనమ్మకమూ నిండిఉన్నవి. ఇతరదేశాలు తమ ఆయుధాలను అన్నింటినీ నాశనముచేసివేస్తున్నప్పుడు ఏదేశమైనా ఎవరికీ తెలియకుండా రహస్యంగా తన ఆయుధాలను భద్రపరుచుకుంటే దానికి సైనికంగా బ్రహ్మాండమైన స్థాయి చిక్కుతుంది.

ఐక్యరాజ్యసమితి నిరాయుధీకరణకు కృషి ప్రారంభించడానికి ప్రయత్నిస్తున్నది. అంతర్జాతీయ పర్యవేక్షణవిధానంక్రింద పరమాణు, అణు పరీక్షలను నిలిపివేయించడం నిరాయుధీకరణ కార్యకలాపంలో ఒక ముఖ్యమైన మెట్టు కాగలదు.

## శాంతికై శాస్త్రవిజ్ఞానము

ఆధునిక వైజ్ఞానిక పరిశోధనలు మానవాళికి హానికరములు కాకుండా అన్నివిధాలా సహాయపడేటట్లు ఐక్యరాజ్యసమితి తగిన చర్యలను తీసుకుం



న్యూక్లియర్ శక్తి ఉపయోగాలను గురించి బెల్జియములోని ఒక ప్రత్యేక ప్రయోగశాలలో పరిశీలనలు గావిస్తున్న ఒక సాంకేతిక వైజ్ఞానికుడు. వైద్యం, రసాయనం, జీవశాస్త్రం మొదలైన రంగాలలో అణుశక్తి ఉపయోగాలను గురించి ఇక్కడ ప్రయోగపరిశీలనలు జరుగుతాయి.

టున్నది. 1953 లో ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్, ఆయాదేశాలు అణ్వస్త్రాలను అదుపులో ఉంచడం సాధ్యంకాకపోయినా అణుశక్తిని శాంతికాలప్రయోజనాల నిమిత్తమై ఉపయోగించవలసిందిగా ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశానికి సూచించారు.

ఐక్యరాజ్యసమితి అనేక మహాసభలను జరిపింది. ప్రపంచంలోని అనేకదేశాల శాస్త్రవేత్తలు ఆ సభల్లో పాల్గొని తమ శాస్త్రజ్ఞానమును పరస్పరం తెలుసుకునే అవకాశం కలిగింది. 1957 లో ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పరమాణుశక్తివిచారణసంఘాన్ని నెలకొల్పింది. ఈ సంఘం అణుశక్తి శాంతికాలప్రయోజనాల వినియోగాలనే ప్రోత్సహిస్తుంది.

విశ్వాంతరాళప్రదేశాన్ని శాంతియుతప్రయోజనాలకు వినియోగించుకునేందుకు ఏ ఏ మార్గాలు ఉన్నదీగూడా ఐక్యరాజ్యసమితి పరిశీలిస్తున్నది.

## ఆర్థిక, సాంఘిక సంఘం

ఈ ఆర్థిక సాంఘిక సంఘాన్ని ముక్తసరిగా "ఎకోసాక్" అని అంటూంటారు. ఈ సంఘం ఉద్యోగాలు, వాణిజ్యం, విద్య, ఆరోగ్యం-వీటికి సంబంధించిన సమస్యలను చేపడుతుంది. ఇది ఇంకా అన్నిదేశాల ప్రజల హక్కులనూ, స్వాతంత్ర్యమునూ పెంపొందించడానికి సైతం కృషిచేస్తూ ఉంటుంది.

దారిద్ర్యం, వ్యాధిపీడన, అజ్ఞానం అనర్థదాయకమని అందరికీ తెలిసిన విషయమే. మానవసంఘర్షణ అంకురార్పణమయ్యే మూలక్షేత్రములు అవే. ప్రపంచంలోని జనసంఖ్యలో మూడింట రెండువంతులమంది యీ స్థితిలోనే మనుగడ సాగిస్తూ ఉన్నారు. అందువల్లనే ఆర్థిక, సాంఘిక సంఘం చేసే పని చాలా చాలా ముఖ్యమైనది. ఆధునిక ప్రమాణాల దృష్ట్యా ఏ ఏ దేశాలలోనైతే అభ్యుదయాభివృద్ధి కార్యక్రమాలు మందకొడిగా సాగుతున్నాయో, ఆ దేశ ప్రజల స్థితిగతులను మెరుగుపరచడానికి యీ సంఘం ఎంతో సహాయం చేస్తున్నది. ఇటువంటిదేశాలనే అభివృద్ధికాంచని రాజ్యాలుగా పేర్కొంటున్నారు.



సమితితాలూకు ఆర్థిక, సాంఘిక సంఘ సభాస్థలి

ఈ ఆర్థిక, సాంఘిక సంఘంలో పద్దెనిమిది సభ్యత్వరాజ్యాలు ఉన్నాయి. వీటిని అన్నింటిని సర్వసభ్యసమావేశమే ఎన్నుకొంటుంది. ఆర్థిక, సాంఘిక రంగాలకు సంబంధించిన తీర్మానాలనన్నింటినీ సర్వసభ్యసమావేశమే చేయ వలసిఉన్నది. ఐతే వాటికి సంబంధించిన పథకాలు పరిశీలించి సిఫార్సులను చేసేవి ఆర్థిక, సాంఘికసంఘమూ, దానియొక్క కమీషన్లూ, కమిటీలూ మాత్రమే.

## సాంకేతిక సహాయము

మొట్టమొదట సాంకేతిక సహాయాన్ని అభివృద్ధిచేసింది ఐక్యరాజ్య సమితే. అభివృద్ధిసాధించని దేశాలలోనివారికి స్వయంసహాయ మార్గాలు తెలియజేయటానికని "ఎలాగో తెలుసుకో" అనే ఒక ముఖ్యమైన పద్ధతి ద్వారా తమకి తెలిసిన విషయాలను పంపకం చేయడానికి ఏర్పాటుచేశారు. ఇటువంటి సహాయం ఇవ్వటం ఐక్యరాజ్యసమితి సాధించిన కార్యాలలో

ముఖ్యమైనదనే చెప్పాలి. సాంకేతికసహాయవిధానం అత్యంత విజయవంతము ఐనందువల్ల బహుళ ప్రజామోదం పొంది అంతకంతకూ విస్తరిస్తూనే ఉన్నది.

ఐక్యరాజ్యసమితిలోని సభ్యత్వరాజ్యాలన్నీ తమ సాంకేతిక పరిజ్ఞానాన్ని పరస్పరం కొంతన్నా పంచుకోవాలనే ఆకాంక్షతో కలుసుకున్నాయి. సాంకేతిక సహాయం కావాలని కోరిన నూటిరవైఐదుదేశాలకూ, ప్రాంతాలకూ ముప్పాతికకుపైగా వివిధదేశాలనుండీ వచ్చిన వేలాది ప్రవీణులు తమ నైపుణ్యాన్ని అందజేశారు.

వందదేశాలనుండి వేలాది మందికి విద్యావేతనాలనిచ్చి ఇతరదేశాల పర్యటనంచేసి, అక్కడ ప్రత్యేక శిక్షణ పొందటానికి అవకాశాలను విపులంగా కల్పించారు. స్వదేశములందు లభించని నూతన పరిజ్ఞానాన్ని విదేశాలలో పొందగలిగారు. సాంకేతిక సహాయము నొసగిన శాస్త్రీయనిపుణుల కృషి

ఇండోనీషియాలోని ఒక ఫ్యాక్టరీలో చాలామంది యువతులు పింగాణి కప్పులూసాసర్ల తయారీలో శిక్షణపొందుతున్నారు. సమితిసాంకేతిక సహాయనిపుణుల మార్గదర్శకత్వంకింద ఈఫ్యాక్టరీ నెలకొల్పబడింది.



అనేక రంగాలలోకి ప్రవేశించింది. వ్యవసాయము మొదలుకొని కార్ఖానా పనివరకూ, నేర నిరోధము మొదలు విద్యావిధానమువరకూ ఈ కృషి విస్తరించింది.

పైరులు పెంచే పద్ధతులు చాలా అభివృద్ధి చెందాయి. కొత్త కార్ఖానాలు నిర్మింపబడినవి. పాతవి ఎక్కువ ఉత్పత్తిచేయుటకై బాగుచేయబడ్డాయి. ప్రజల ఆరోగ్యమునకు, పిల్లల సంరక్షణకు సంబంధించిన కార్యకలాపాలు అనేకం ప్రవేశపెట్టబడ్డాయి. పన్నులు వసూలుచేయడానికి ఉత్తమ విధానాలు, ప్రభుత్వ కార్యకలాపాలని మేలైన పద్ధతులలో ఎట్లా నిర్వహించవచ్చునో సలహా ఇవ్వబడింది. అనేకగృహములు, పాఠశాలలు నిర్మింపబడినవి.

ప్రపంచంలోని వివిధదేశాలూ తమ తమ ప్రావీణ్యతలను పరస్పరం పంచుకునేందుకు ఈ కార్యక్రమం ఎంతో దోహదం చేసింది. ఇంజనీరింగ్,

ఆండీస్‌లో ఒక గ్రామనాయకుడు తన బార్లీపంటను ఎలా అభివృద్ధి పరచుకోవడమో ఒక ఇటలీపంటలనిపుణుని నుంచి తెలుసుకొంటున్నాడు. బొలీవియా, ఈక్వెడారు, పెరూలలో నివసిస్తున్న సుమారు అరవైలక్షల మంది భారతీయులు ఇటువంటి సాంకేతిక సహాయం పొందుతున్నారు.



పరిపాలనా రంగాలలాంటి ఏ ఒక్కొక్క క్షేత్రంలోనో సాంకేతిక సహాయం పొందిన అనేకదేశాలు పురావస్తుశాస్త్రము, లేదా మత్స్యపరిశ్రమలలాంటి మిగతా క్షేత్రాలలో నిపుణులైన వారిని ఇతరదేశాలకు పంపవచ్చును. ఏదేశం గాని దయాధర్మంగా మరొక దేశంనుండి సహాయాన్ని తీసుకుందన్నట్లు భావించనవసరంలేదు. అన్నిదేశాలూ ఐక్యరాజ్యసమితి సభ్యులుగానే పని చేస్తున్నారు. ఈ సాంకేతిక సహాయ కార్యక్రమం క్రింద అయ్యే ఖర్చును అందరూ సరిసమానంగా భరిస్తారు.

ప్రపంచమంతటా ప్రజాక్షేమానికై అందరూ కలిసి చేయు కృషి యొక్క విలువను కొలవలేము. సాంకేతిక సహాయము ఎంత యథార్థమో ఇదీ అంతే యథార్థము. ఐక్యరాజ్యసమితి అనేక రాజ్యాలకు వాటి ఆర్థిక స్తోమతను పెంపొందించటమేగాకుండా, వారి జీవన ప్రమాణాలను అభివృద్ధి చేయటంతోబాటు, దేశదేశాలమధ్యా స్నేహసంబంధాలనుకూడా బలపరచ డంలో ఎంతో తోడ్పడిందనే చెప్పాలి.

## ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ బాలల అత్యవసర నిధి

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అనేక లక్షలమంది పిల్లలు ఇల్లూ, వాకిలీ లేని అనాథలైపోయారు. ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల అత్యవసరనిధిని పిల్లలక్షేమంకొరకు, సహాయార్థం కొరకు ఏర్పరచింది. దీనినే 'యు ని సె ఫ్' అని అంటారు.

ఈ ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల ఆవశ్యకనిధి ఒక శాశ్వత సంస్థగా ఏర్పరుపబడింది. ఇది వెనుకబడియున్న దేశాలలోని నిస్సహాయులైన పిల్లల సహాయంకొరకే ప్రత్యేకంగా నెలకొల్పబడింది. ఈ సంస్థ సుమారు వందకు పైగా ఎన్నో దేశాలలోని, ప్రాంతాలలోని లక్షలాది అనాథబాలలకు ఆహారం, వైద్యసహాయం, గుడ్డలు మొదలయిన సదుపాయాలతోబాటు వస్తుసామగ్రిని సైతం సరఫరాచేసింది.

ఇంకా యీసంస్థ పిల్లల వ్యాధుల నిర్మూలనంకొరకు పోరాడుచున్నది. పిల్లలకు సంభవించు క్షయ, యాస్‌లాంటి వ్యాధులను అరికట్టటానికి సర్వ విధాలా పోరాడుతున్నది. యాస్ అనే వ్యాధి చాలా ఘోరమైనది. అది రాగానే శరీరమంతా రణములతో నిండిపోతుంది. ఇది వచ్చినవారు అంగవిహీనులు కూడా కావచ్చు. కాని ఈ యాస్ వ్యాధిని ఒక పెన్సిలిన్ ఇంజక్షన్‌తో నివా రింపవచ్చును.

ఈ ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల అత్యవసరనిధితోబాటు ప్రపంచ ఆరోగ్యసంస్థకూడా కలిసి పనిచేసి పాతిక దేశాలకుపైగా యీ యాస్ అనే రణముల వ్యాధిని రాకుండా నిరోధించగలిగారు. హైతీలోనైతే యాస్ వ్యాధిని పూర్తిగా నివారించేశారు.

ఈ ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల అత్యవసరనిధిలో చాలా భాగం అనేక ప్రభుత్వాలనుండి, వ్యక్తులనుండి వస్తూ ఉంటుంది. ఈ ధన మంతా వారంతట వారు ఇచ్చినదే. ప్రపంచమంతటా ప్రసిద్ధిచెందిన యునిసెఫ్



బొంబాయి ప్రభుత్వంవారు' బడిపిల్లలకు రాష్ట్రమంతటా 'యునిసెఫ్' పాలు పంచి పెడుతున్నారు. ఈ ఏడేళ్ల నర్మదలాంటి పిల్లలందరూ ఆ పాలు దినదినమూ కమ్మగా తాగుతున్నారు.



హొండూరాస్‌లో బడిప్రాయపు పిల్లలందరూ ఉచితంగా లభిస్తున్న ఈ పాలను హాయిగా తాగుతున్నారు. అక్కడి పిల్లల్లో దాదాపు సగానికిపైగా, వారి ఆనవాయితీ తిండిఫలితంగా, నీరసిల్లిపోయినట్లు పరిశోధనలు నిరూపించాయి.

క్రిస్‌మస్ కార్డుల అమ్మకంద్వారా గూడా యీ నిధికి కొంత పైకం చేకూరుతుంది.

పిల్లలే యీ సంస్థకై విరాళాలు వసూలుచేయటంకూడా కద్దు. యునైటెడ్ స్టేట్సులోనూ, కెనడాలోనూ వేలాది బాలలు పాలసీసాల డిబ్బెనలలో వారి ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల ఆవశ్యకనిధికై డబ్బు వసూలు చేస్తూంటారు.



అల్జీరియా అంతఃకల్లోలాల మూలంగా కాందిశీకు లైన అనేకమందిలో ఈ పిల్లతల్లి ఒకతె. ఇటు వంటివారికి సమితి కాందిశీక ప్రధానాధికారి చాలా సహాయం చేస్తారు.

## కాందిశీకులకు చేయూత

ఐక్యరాజ్యసమితి కాందిశీకుల క్షేమసమాచారాలు చూడడానికి ఒక ఉన్నతాధికారిని నియమించింది. యుద్ధకారణంచేతనో, రాజకీయాల కారణంచేతనో స్వదేశాన్నివదలి విదేశాలలో తలదాచుకునే లక్షలాది కాందిశీకుల సహాయార్థం యీ ఏర్పాటు చేయబడింది.

ఈ ఉన్నత అధికారి లక్షలాది కాందిశీకులకు రక్షణ ఇచ్చారు. ఈ కార్యక్రమం అత్యంత ప్రధానమైనదిగా పరిగణింపబడుటచే ఐక్యరాజ్యసమితి కాందిశీక ప్రధానాధికారి కార్యాలయానికి 1954 లో నోబెల్ శాంతి బహుమానం ఇవ్వబడింది.

ఈ కార్యాలయం కాందిశీకులకు ఎన్నోవిధాల సహాయంచేస్తున్నది. వారికి శాశ్వతనివాస సౌకర్యాలను కల్పించడానికి ప్రయత్నిస్తుంది. 1956 వ సంవత్సరం హంగరీదేశంలో జరిగిన తిరుగుబాటు అనంతరం తమదేశం వదలి పారిపోయివచ్చిన అనేకవేలమంది హంగేరియనులకు వెంటనే భారీ ఎత్తున సహాయం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడటంతో యీ కార్యాలయం మరొక నూతన విపత్కర పరిస్థితిని ఎదుర్కొనవలసి వచ్చింది.

# మానవహక్కులు

ఐక్యరాజ్యసమితియొక్క ముఖ్యోద్దేశాలలో మానవ హక్కులను, స్వాతంత్ర్యాలను వృద్ధిచేయటం ఒకటి అని మనము తెలుసుకున్నాము. చరిత్రలోనే ప్రప్రథమంగా మానవహక్కులంటే ఏమిటో తెలియజేసే ఒక అంతర్జాతీయ నిర్వచనాన్ని ఐక్యరాజ్యసమితి చేసింది. ఇదే "సార్వజనిక మానవ హక్కుల ప్రకటన." ఇది 1948 డిసెంబరు పదవతేదీన అమలులోనికి వచ్చింది. అప్పటినుండి ప్రతి డిసెంబరు పదవతేదీని మానవ హక్కుల దినముగా పరిగణిస్తూఉన్నారు.

"సార్వజనిక మానవ హక్కుల ప్రకటన" యీ క్రిందివిధంగా సకల ప్రభుత్వాలకీ లక్ష్యంగా ఉండతగిన మానవ హక్కుల పరమావధులను పేర్కొన్నది:

1. ప్రతివ్యక్తికీ జీవించుటకు, స్వాతంత్ర్యమునకు, భద్రతకు హక్కు గలదు.
2. ప్రతివారికి విద్యాభ్యాసమునకు, సమానతకు చట్టప్రకారం సమాన హక్కు కలిగి ఉండుట.
3. ప్రతివ్యక్తికీ స్వేచ్ఛగా తిరుగుటకు, ఇష్టమువచ్చినట్లు పూజించు కొనుటకు, ఇతరదేశస్థులతో స్వేచ్ఛగా సంచరించుటకు, విజ్ఞాన అన్వేషణకు, అవసరమైన సమాచారసేకరణకు హక్కు కలిగి యుండుట.
4. ప్రతివ్యక్తికీ తనదేశంలో పౌరసత్వం కలిగిఉండటానికీ, సానుకూలవాతావరణంలో పనిచేయటానికీ, సమానమైన పనికీ, సమాన వేతనము పొందటానికీ హక్కు కలిగి ఉండుట.
5. వివాహము చేసుకొనుటకు, కుటుంబమును వృద్ధిచేసుకొనుటకు హక్కు కలిగియుండుట.



ప్రపంచ ఆరోగ్యసంస్థతోడ్పాటుతో ట్యునీషియాలో సేవాకార్యక్రమం నిర్వహిస్తున్న ఒకదళం.



ప్రపంచ ఆరోగ్యసంస్థ సలహాల ధర్మమా అని ఫ్రెంచి కామరూన్సు ప్రాంతంలోని ఈ పిల్లలు సురక్షితమైన నీటిసప్లయికి నోచుకొని హాయిగా స్నానాలు చేస్తున్నారు. మురికినీటిమూలంగా దాపరిస్తూవచ్చిన టైఫాయిడు ఆ ప్రాంతంలో ఇప్పుడు ఈ మూలంగా తగ్గుముఖం పట్టింది.

ఐక్యరాజ్యసమితి మానవ హక్కులను గురించి ఇప్పుడు రెండు కొత్త పత్రములను తయారుచేస్తున్నది. వాటినే "మానవహక్కుల అంతర్జాతీయ ఒడంబడికలు" అని అంటున్నారు. సార్వజనిక ప్రకటనలో చెప్పబడిన విషయాలను అవి అమలుజరపాలని అభిప్రాయం.

ఈ సార్వజనికమానవహక్కుల ప్రకటన ఐక్యరాజ్యసమితి సాధించిన ఘనకార్యములలోకెల్ల శ్రేష్ఠమైనదనే చెప్పాలి. ఇది మానవ అభ్యుదయ ఉద్యమాలలోనే ఎన్నుకోతగిన ఘనకార్యం.

ఈ ప్రకటన అనేకదేశాలకు తమ రాజ్యాంగ నిర్మాణమునందు ప్రముఖపాత్ర వహించినది. దీనివలన బానిసత్వము, బలాత్కారముగా చేయించు శరీరశ్రమ, స్త్రీల, పిల్లల హక్కులు మొదలగు విషయాలపట్ల కొన్నిదేశాల దృక్పథంలోనూ, ఉద్దేశ్యాలలోనూ మార్పు తేవడానికి ఎంతో సహాయం చేసినది.



సింగపూరు రేవులోని నౌకలను ఒక అధికారి తదేకదీక్షగా పరిశీలిస్తున్నారు. ప్రయాణికు లెవరికయినా అపాయకరమైన జబ్బు లున్నాయేమో చూచి, ఉంటే అటువంటివారిని తక్కినవారికి దూరంగా ఉంచుతారు. ప్రపంచ ఆరోగ్యసంస్థ

ప్రప్రథమ ప్రపంచ మానవ హక్కుల ప్రణాళికలో నిర్దేశించిన ప్రమాణాలు ప్రపంచమంతటా ప్రజల జీవితాలలో యథార్థాలు కావడానికి ఐక్యరాజ్యసమితి సహాయం చేస్తున్నది.

## ఆరోగ్యము

ఐక్యరాజ్యసమితి ఆరోగ్యాభివృద్ధికీ, ప్రధానవ్యాధుల నివారణకీ కృషి చేస్తూ ఉంది. ప్రపంచ ఆరోగ్యసంస్థ, ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ పిల్లల అత్యవసర నిధి సాంకేతిక సహాయానికి సంబంధించిన అనేకసంఘాలు— అన్నీకూడా ప్రపంచంలోగల ఘోరవ్యాధులను అరికట్టటానికి తీవ్ర కృషి చేస్తున్నాయి.

విస్తృతంగా వ్యాప్తిచెందిన అనేకవ్యాధులు క్రమశః తగ్గుముఖం పడుతున్నవి. ప్రమాదకరమైన అంటువ్యాధులు నివారించబడినవి. ఉదాహరణకి, అనేకలక్షలమందిని హతమార్చిన మలేరియా వ్యాధి పది సంవత్సరాల



జినీవాలో (స్విట్జర్లాండు) సమితి ఆధ్వర్యాన నెలకొన్న మత్తువస్తువుల పరిశోధన శాలలో ఈ డాక్టరూ, ఆయన సహాయకుడూ నల్లమందు మచ్చులను పరిశోధిస్తున్నారు.

లోగా సమూలంగా నిర్మూలనం కావచ్చును. కుష్ఠువ్యాధినిసైతం యీ విధంగానే దారిపట్టించాలని ప్రయత్నిస్తున్నారు.

## ఆర్థిక, సాంఘిక సంఘములలోని శాఖలు

ఆర్థిక, సాంఘిక సంఘం నిర్వహించు కార్యక్రమాలు అన్నీ ఒకే ఒక సంస్థమూలంగా జరగటం కష్టసాధ్యం. కార్యక్రమ నిర్వహణలో సహాయం చేయటానికి దీనికి చెందిన అనేక కమీషన్లు ఉన్నాయి. ఇందులో ఒకదానిని కార్యకర్తృత్వ కమీషన్లు అని అంటారు. ఒక్కొక్క కమీషను ఒక్కొక్క ప్రత్యేక విషయాన్ని పరిశీలించి తన సలహాలను ఆర్థిక, సాంఘిక సంఘానికి అందజేస్తూ ఉంటుంది. వాటిలోని ముఖ్యమైన కార్యకర్తృత్వ కమీషన్లు ఏవంటే—

ఆస్ట్రేలియా కొండల్లో ఒక రోడ్డు నిర్మాణం. ఈ బుల్ డోజర్ లాటి భారీయంత్రాలను కొనడానికి అంతర్జాతీయ పునర్నిర్మాణ అభివృద్ధి బ్యాంకు ఇచ్చే అప్పు మొత్తాలు ఉపయోగించుకొంటారు.



1. మానవ హక్కుల కమీషను,
2. మత్తుమందులకు సంబంధించిన కమీషను,
3. సాంఘిక విషయాల కమీషను,
4. జనసంఖ్యా కమీషను,
5. స్త్రీల స్థాయికి సంబంధించిన కమీషను,
6. గణాంక కమీషను,
7. అంతర్జాతీయ వస్తు, వాణిజ్య విషయాల కమీషను.

రెండవగ్రూపులో ప్రాంతీయ కమీషన్లు ఉంటాయి. వేర్వేరు భౌగోళిక ప్రాంతాలకూ సంబంధించిన ప్రత్యేక సమస్యలను ఇవి పరిశీలిస్తాయి. ఆ ప్రాంతీయకమీషన్లు ఏవంటే—

1. యూరపు ఆర్థిక కమీషను,
2. ఆసియా దూరపుతూర్పు ప్రాంతాల ఆర్థిక కమీషను,
3. ల్యాటిన్ అమెరికా ఆర్థిక కమీషను,
4. ఆఫ్రికాదేశ ఆర్థిక కమీషను.

ఐక్యరాజ్యసమితిలో ఆర్థిక, సాంఘిక సంఘం చాలా ప్రముఖమైన విభాగము. ఇది ప్రభుత్వాలకు సంబంధములేని గ్రూపులతో వ్యవహరిస్తుంది. ఈ గ్రూపులను ప్రభుత్వ సంబంధములేని సంస్థలనీ, క్లుప్తముగా యన్. జి.

ఓస్ అనీ పిలుస్తారు. వీటిలో ప్రభుత్వోద్యోగులుకాని సామాన్య పౌరులు ఉంటారు. వీరు ఏ సంఘాలకో, క్లబ్బులకో, కార్మిక సంఘాలకో చెందిన వారై ఉంటారు. ఒకానొక సమస్యను గురించి ప్రత్యేకంగా తెలుసుకోవలసిన విషయాలు ఏమన్నా ఉన్నప్పుడు వాటిని గురించి బాగా తెలిసి ఉన్న యన్. జి. ఓ. లతో ఆర్థిక, సాంఘిక సంఘం చర్చలు జరుపుతుంది.

## ప్రవీణుల సంఘాలు

ఆర్థిక, సాంఘిక సంఘము తన పనికై కార్యకర్తృత్వ నిర్వాహక వర్గముమీదనూ, ప్రాంతీయ వ్యవహార కమీషన్లమీదనూ మాత్రమే ఆధార పడదు. ప్రవీణులసంఘాలు అనే వాటిద్వారాగూడా ఇది పనిచేస్తూ ఉంటుంది. ఇవి వేర్వేరు ప్రపంచ సంస్థలు. వీటిలో ఏయే సభ్యత్వరాజ్యం చేరినా అవి ఏర్పడతాయి. ప్రపంచ ఆరోగ్యసంస్థ ఒక ప్రత్యేక ప్రావీణ్యతాసంస్థ.

మిడతలదండు ఆగడాలను అణచడానికి ఫ్రెంచి మొరాకాలో మిడతలు వచ్చివాలే చోట్ల విషంమందులు ఇలా విచ్చలవిడిగా చల్లిపెడుతున్నారు. మిడతలపై ఈ దండయాత్ర కార్య కలాపం సమితి ఆహార వ్యవసాయ సంస్థసాయంతో సాగుతున్నది.



ఒక్కొక్కసంస్థ దానికి సంబంధించిన ప్రత్యేక విషయంలో వ్యవహరిస్తుంది. కొన్ని సంస్థలలో తక్కువమంది, మరికొన్నింటిలో ఎక్కువమంది సభ్యులు ఉన్నా, సభ్యత్వబలం ఐక్యరాజ్యసమితిలోవలెనే ఉంటుంది.

ప్రతి ప్రత్యేకసంస్థా దానికి సంబంధించిన వ్యవహారవిషయాలను, రాబడి ఖర్చులను నిర్వహించుకుంటూ ఉంటుంది. కాని ఐక్యరాజ్యసమితితో అనుబంధం కలిగే ఉంటుంది. ఆ ప్రత్యేకసంస్థా, ఐక్యరాజ్యసమితీ ఏవిధంగా కలిసి పనిచేయవలసిందీ నిర్వచించే ఒక ఒప్పందాన్ని కలిగిఉంటాయి. ఆ సంస్థలు యు. యన్. చేపట్టవలసిన విషయాలనుకూడా సూచిస్తాయి. ఆర్థిక, సాంఘికసంస్థ సమావేశాలకు ప్రతినిధులను సైతం అవి పంపగలవు.

ఐక్యరాజ్యసమితికి సంబంధించిన ప్రత్యేక ప్రావీణ్యతాసంస్థలు ఏవంటే—

1. అంతర్జాతీయ పరమాణుశక్తి విచారణసంఘం.
2. అంతర్జాతీయ కార్మికసంస్థ.
3. ఐక్యరాజ్యసమితి ఆహార, వ్యవసాయసంస్థ.
4. ఐక్యరాజ్యసమితి విద్యా, శాస్త్రవిజ్ఞాన, వైజ్ఞానికసంస్థ.
5. ప్రపంచ ఆరోగ్యసంస్థ.
6. అంతర్జాతీయ పునర్నిర్మాణ, అభివృద్ధి కార్యకలాపాల బాంకింగ్ సంస్థ.
7. అంతర్జాతీయ ఆర్థిక సంస్థ.
8. అంతర్జాతీయ ద్రవ్యనిధి.
9. అంతర్జాతీయ పౌర, వైమానిక సంస్థ.
10. విశ్వజనీన తపాలాసంస్థ.
11. అంతర్జాతీయ తంతి సమాచారసంస్థ.
12. అంతరిక్ష విషయాల సంస్థ.
13. అంతర్ ప్రభుత్వ సముద్ర విషయ సంప్రదింపుల సంస్థ.

ఆర్థిక, సాంఘిక సంఘము దానికి సంబంధించిన ప్రావీణ్యసంస్థల తోనూ, అనేక కమీషన్లతోనూ ప్రపంచ ఆర్థిక, సాంఘిక సమస్యలను వ్యవహరించడానికి ఏర్పడిన ఉత్కృష్టసంస్థ అనే చెప్పాలి.

## ధర్మ కర్తృత్వ సంఘం

ధర్మకర్తృత్వ సంఘం ధర్మకర్తృత్వప్రాంతాలను గురించే వ్యవహరిస్తుంది. పూర్వం వలసలుగా ఉన్న వీటిని ధర్మకర్తృత్వ ఒడంబడికలు అనే పేరిట యు. యన్. ప్రస్తుతం పర్యవేక్షణ చేస్తున్నది. ప్రతి ఒడంబడికా ఆయా ప్రాంతాలను ఎవరు, ఎట్లా పరిపాలించాలో తెలియజేస్తుంది.

ఏదేశం ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తుందో అది పరిపాలనాధికార రాజ్యంగా పిలువబడుతుంది. అది ఐక్యరాజ్యసమితియొక్క నిబంధనావళిని అనుసరించి,



ఆ షరతుల ప్రకారమే ఆ ప్రాంతాన్ని పరిపాలించాలి. ఆ షరతులు కూడా ఆ ప్రాంత పురోభివృద్ధికీ, స్వపరిపాలనకూ దోహదంచేసేవిగా కూడా ఉండాలి.

ధర్మకర్తృత్వ సంఘం పద్నాలుగు సభ్యత్వరాజ్యాలతో ఏర్పడుతుంది. అందులో ఏడుగురు యీ ధర్మకర్తృత్వ ప్రాంతాల్ని పరిపాలిస్తారు. మిగతా ఏడుగురికీ దానితో సంబంధం లేదు. ఈ ధర్మకర్తృత్వ సంఘంలోని ప్రతి సభ్యునికి ఒక ఓటు ఉంటుంది. సమాన అధికసంఖ్యాకబలంతో నిర్ణయాలు తీసుకోబడతాయి.

ధర్మకర్తృత్వ ప్రాంతాలలోని ప్రజలు ఎంతవరకూ అభివృద్ధిని సాధించారో తెలుసుకోవటానికి యీ సంఘం ఒక ప్రశ్నావళిని తయారు చేసి పంపిస్తూ ఉంటుంది. ఆ ప్రశ్నావళికి వచ్చిన ప్రత్యుత్తరాలను గురించి ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న రాజ్యంతో చర్చలు సాగిస్తుంది. ధర్మకర్తృత్వ ప్రాంతాలలోని ప్రజల విన్నపములన్నీ పరీక్షిస్తుంది. నిజం తెలుసుకోవటానికి, ఆయా ప్రాంతాలలోని పరిస్థితులను పరిశీలించడానికి పర్యటనలు చేస్తుంది.

## స్వాతంత్ర్యాన్ని ప్రోత్సహించుట

యుద్ధకారణంగా పూర్వపురోజుల్లో నూతన రాజ్యాలు ఉద్భవించేవి. ఐక్యరాజ్యసమితి యీ పంథాను మార్చడానికి తోడ్పడింది.

ఐక్యరాజ్యసమితి ఏర్పడినతరువాత ఆసియా, ఆఫ్రికాలలో ఇరవై రాజ్యాలకు పైగా స్వాతంత్ర్యాన్ని సాధించాయి. వీటిలో చాలా రాజ్యాలు శాంతియుతమైన విధానాలవల్లనే సృష్టింపబడినవి. ఇంకా అనేకరాజ్యాలు స్వాతంత్ర్యసముపార్జనామార్గంలో ప్రయాణిస్తూ ఉన్నాయి.

అలాంటి విషయాలలో ఐక్యరాజ్యసమితి ఎట్లా పనిచేస్తుందో ఒక ఉదాహరణద్వారా తెలుసుకుందాం.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అగ్రరాజ్యాలు పూర్వపు ఇటలీ వలసలైన లిబియా, ఎరిట్రియా, సోమాలీలాండ్‌లను ఏమిచెయ్యటమా అనే విషయంలో సమాధానానికి రాలేకపోయారు. ఈ ప్రశ్నను వీరు ఐక్యరాజ్య



ధర్మకర్తృత్వ సంఘ సభాస్థలి. కిటికీకి ఎడమవేపు ఉన్న ఆ విగ్రహం ఒక డేనిష్ శిల్పి టేకు కొయ్యతో మలిచింది. అది మానవవర్గాన్నీ, ఆశాజ్యోతినీ సూచిస్తుంది.

సమితి సర్వసభ్యసమావేశానికి నివేదించారు. సర్వసభ్యసమావేశం, లిబియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలనీ, ఎరిత్రియాను ఇథియోపియాతో కలిపివేయాలనీ, సోమాలీలాండ్‌లో పది సంవత్సరాలపాటు ధర్మకర్తృత్వ పరిపాలన ఉండాలనీ తీర్మానించింది.

ఐక్యరాజ్యసమితి ఉనికి, దాని నిబంధనావళి కారణంగా కొత్తదేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవడం సులభమయినది. ఉదాహరణకి బ్రిటిష్ టోగోలాండు ధర్మకర్తృత్వ ప్రాంతంగా ఉండేది. కాని 1957 లో నూతన ఘనాదేశానికి చెందిన ఒకభాగంగా ఇది స్వాతంత్ర్యాన్ని సంపాదించింది. ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ విధానంక్రింద ఇంకా అనేకప్రాంతాలు క్రమశః స్వాతంత్ర్యాన్ని సంపాదించగలవు.

ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాలమధ్య స్నేహసంబంధాలను అభివృద్ధిపరచడానికి ఉద్దేశించిన కార్యక్రమంలో ఐక్యరాజ్యసమితి ఆయా ప్రాంతాల స్వాతంత్ర్య సముపార్జనకు సహాయం చేసే కార్యకలాపం ఒక భాగం.



ధర్మకర్తృత్వప్రాంతంగా ఉంటూవచ్చిన బ్రిటిష్ టోగోలాండు ఇప్పుడు నూతన ఘనాదేశంలో ఒకభాగమైపోయింది. అక్కడి గోల్డుకోస్టులో దోనెలూ తెప్పలనుంచి సరుకులు దింపి గట్టుకు చేరుస్తున్న దృశ్యం ఇది.

# స్వయంపరిపాలనాధికారం లేని ప్రాంతాలు

ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ ప్రాంతాలను పర్యవేక్షించడమే కాకుండా స్వయంపరిపాలన లేని ప్రాంతాల ప్రజల స్థితిగతులను కూడా గమనిస్తూనే ఉంటుంది.

ఈ ప్రాంతాలను ఒక దేశం పాలిస్తూ ఉంటుంది. పరిపాలనా విషయాలను అదే నిర్ణయిస్తుంది.

స్వయంపరిపాలనాధికారం లేని ప్రాంతాలను అవి ధర్మకర్తృత్వ ప్రాంతాలయితేనే ధర్మకర్తృత్వ సంఘం పర్యవేక్షణ చేస్తుంది. కాబట్టి స్వయంపరిపాలనాధికారం లేని మిగతా ప్రాంతాలను కనిపెట్టి చూడడానికిగాను సర్వసభ్యసమావేశం ఒక ప్రత్యేక కమిటీని నియమిస్తుంది. ఈ ప్రాంతాలను పరిపాలించే రాజ్యాలు అచ్చటి పరిస్థితులను గురించి ఎప్పటికప్పుడు ఐక్య



పసిఫిక్ దీవుల్లోని ధర్మకర్తృత్వ ప్రాంతవాసులైన కొందరు పొనాపియన్ స్త్రీపురుషుల కూటం. ఈ ప్రాంతం యునైటెడ్ స్టేట్సు పరిపాలనక్రింద ఉంది.



రాజ్యసమితికి నివేదికలను అందజేస్తూ ఉంటాయి. ఈ నివేదికలను గురించి ప్రత్యేక కమిటీ చర్చించి పాలనారాజ్యాలకి సలహాలనిస్తుంది.

మొదట్లో అరవయిప్రాంతాలకు పైగా సమాచారం పంపించబడింది. కాని రాను రాను ఇది తగ్గుముఖం పట్టింది. క్రమశః అనేకప్రాంతాలు స్వయంపరిపాలనాధికారాన్ని పొందుతున్నాయి. స్వాతంత్ర్యం పొందింతోటే అవన్నీగూడా ఐక్యరాజ్యసమితిలో చేరతాయి.

ఇక్కడ ఒక విచిత్రమైన విషయం ఏమంటే, స్వయంపరిపాలనాధికారం లేని ప్రాంతాలూ, ధర్మకర్తృత్వ ప్రాంతాలకు సంబంధించిన వ్యవహార కాండ ఐక్యరాజ్యసమితికి బొత్తిగా తరిగిపోతున్నది. ఒకానొకనాటికి యీ రంగంలో తన పనినంతా పూర్తిచేసుకుని "ఇహ చేసేందుకు ఏమీ లేదు" అన వచ్చును కూడాను!

# అంతర్జాతీయ న్యాయస్థానము

ఐక్యరాజ్యసమితి నిబంధనావళి ప్రకారం ఆయాదేశాలు తమ తగాదాలను శాంతియుతంగా పరిష్కారం చేసుకోవాలి. రాజకీయకలహాలను శాంతి యుతంగా పరిష్కరించుకోవటానికి సర్వసభ్యసమావేశం, భద్రతాసంఘం ఆ దేశాలకు సహాయం చేస్తాయి. అంతర్జాతీయ న్యాయస్థానము చట్టసమ్మత మయిన తగాదాలను పరిష్కరించుకోవడంలో వారికి సహాయం చేస్తుంది.

చట్టబద్ధమైన తీర్పులను అందించుటలో ఐక్యరాజ్యసమితికి చెందిన న్యాయస్థానము అతి ముఖ్యమైనది. న్యాయస్థానం ముందున్న కేసుల విచారణలో, ఆయా రాజ్యాలు మాత్రమే పాల్గొంటాయి. అదీ తమకు ఇష్టం ఐతేనే. ఒక కేసుకు సంబంధించిన ఇరుపక్షాల దేశాలూ ఆ కేసును న్యాయస్థానానికి నివేదించడానికి అంగీకరించనిపక్షంలో విచారణ జరగడానికి అవకాశంలేదు.

ఐనప్పటికీ ముప్ఫయ్‌దేశాలకు పైగా, వాటి తాలూకు చట్టసంబంధమైన కేసులను అన్నింటినీ ఈ న్యాయస్థానాలకే నివేదించగలమని ముందు



న్యూగినీ ధర్మకర్తృత్వ ప్రాంతంలోని న్యూబ్రిటన్ ద్వీపవాసులు సమితి పర్యటన బృందసభ్యుల ఉపన్యాసాలను శ్రద్ధగా వింటున్నారు. ఆస్ట్రేలియా ఈ ప్రాంతాన్ని పరిపాలిస్తున్నది.



హేగ్‌లోని (నెదర్లాండ్సు) అంతర్జాతీయ న్యాయస్థానం.

గానే ప్రకటించాయి. న్యాయస్థాన నిర్ణయాలను అనుసరించి ఎన్నో ప్రమాదకర పరిసితులను చక్కబరచడం జరిగింది.

నెదర్లాండ్సులోని హేగ్‌పట్టణమందు యీ న్యాయస్థానం సమావేశం అవుతుంది. ఇది నిరంతరం సమావేశం అవుతూనే ఉంటుంది. ఇందులో పదిహేనుమంది న్యాయాధిపతులు ఉంటారు. వీరు దేశాల ప్రతినిధులుగా గాక వ్యక్తిగతంగానే ఎంచుకోబడినవారు. ఏ ఇద్దరు సభ్యులూ ఒక జాతివారై ఉండరాదు. జడ్జీల అధికసంఖ్యాకబలాన్నిబట్టి నిర్ణయాలు తీసుకోబడతాయి. ఐతే వీరు తొమ్మిదిమంది అయినా హాజరయి ఉండాలి. ఈ న్యాయస్థాన తీర్పులకు ఇహ తిరుగులేదు.

ఈ న్యాయస్థానం పనిచేయు పద్ధతికి ఇంగ్లండ్, నార్వే దేశాల మత్స్య వ్యాపార విషయానికి సంబంధించిన కేసును ఒక ఉదాహరణంగా చెప్ప వచ్చును. తన తీరం పొడుగునా కొన్ని మండలాలను విదేశ మత్స్యవ్యాపారానికి వీలులేకుండా మూసివేసే హక్కు నార్వేకి లేదని బ్రిటన్ వాదించింది. ఈ మండలాలు సముద్రానికి చెందినవి అవడంవల్ల వీటిమీద అందరికీ హక్కుభుక్తాలు కలవని బల్లగుద్ది చెప్పింది. బ్రిటిష్ మత్స్యనౌకలను ఆటంకపరచినందుకు బాగాపరిహారం ఇవ్వాలనిగూడా నార్వేని కోరింది. బ్రిటిష్ బెస్త వారిలో ఉద్రిక్తత పెరిగింది.

నార్వే, బ్రిటిష్ ప్రభుత్వాలు తమ తగాదాను అంతర్జాతీయ న్యాయస్థానానికి తీసుకొనివెళ్లాయి. 1951 లో న్యాయస్థానం నార్వేకు అనుకూలంగా తీర్పు ఇచ్చింది. బ్రిటన్ ఆ తీర్పును శిరసావహించింది. అంతటితో ఆ కేసు ముగిసింది.

ఆయా దేశాల కేసులను విచారణచేయడమేగాకుండా, ఐక్యరాజ్యసమితి మరోశాఖ ఏదైనా అర్థించినప్పుడు చట్టసంబంధమైన ఏ సమస్యనుగురించి ఐనా సరే న్యాయసానం తన సలహా, అభిప్రాయాలను తెలియజేస్తుంది.

అనేకదేశాలు ఇతరదేశాలతో తమకుగల తగాదాలను రాజకీయమైనవిగానే భావిస్తాయి తప్ప, చట్టసంబంధమయినవిగా భావించవు. అంతర్జాతీయ న్యాయస్థానంలో విచారణ జరిగేది ఒక్క చట్టబద్ధమైన కేసులలోనే కాబట్టి ఎన్నెన్నో కేసులు సర్వసభ్యసమావేశానికీ, భద్రతాసంఘానికే నివేదింపబడతాయిగాని న్యాయస్థానానికి నివేదింపబడవు.

## ప్రధానకార్యదర్శి కార్యాలయము

ఐక్యరాజ్యసమితిలోని ముఖ్యమైన శాఖలలో ప్రధానకార్యదర్శి కార్యాలయం ఆరవది. ఇందులో ప్రధాన కార్యదర్శి, ఐక్యరాజ్యసమితి సిబ్బంది ఉంటారు.

ప్రధాన కార్యదర్శి ఐక్యరాజ్యసమితి ముఖ్యపాలనాధికారి. సమితి వ్యవస్థలో ప్రతిదీ సక్రమంగా సాగిపోయేట్లు చూడటం యీయన విధి.

భద్రతాసంఘం సలహాపై సర్వసభ్యసమావేశం ప్రధాన కార్యదర్శిని ఐదుసంవత్సరాల ఉద్యోగగడువుతో నియమిస్తుంది. ఈ పదవిలో ఉన్నవాడు ఏ తగాదాల్లోనూ వ్యక్తిగతంగా ఏ పక్షమూ వహించకూడదు కాబట్టి చిన్న రాజ్యాల్లో ఒకదానినుండి ఎంచుకోబడతాడు.

నార్వేదేశస్థుడైన ట్రిగ్వేలీ 1946 సంవత్సరంలో ప్రథమ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడ్డారు. 1953 లో ఆయన రాజీనామా ఇవ్వగా, స్వీడన్‌దేశస్థుడైన డాగ్‌హామర్‌షెల్డు ఆ స్థానములో వచ్చారు. 1957 లో మళ్ళీ రెండవపర్యాయం, మరొక ఐదుసంవత్సరాలపాటు, హామర్‌షెల్డే ఎన్నుకోబడ్డారు.*

ఐక్యరాజ్యసమితిలోని వివిధదేశాలకూ ఎలాంటి రాజకీయాధికారము ఉంటుందో ప్రధాన కార్యదర్శికి కూడా అలాంటి అధికారమే ఇవ్వబడింది. ఐక్యరాజ్యసమితి నిబంధనావళిననుసరించి అతడు ప్రపంచశాంతికి భంగం

* ఈయన ఆమధ్య అకస్మాత్తుగా విమానప్రమాదంపాలై విగతజీవియైనందున ఈయన స్థానే తాత్కాలికంగా యు. థాంట్ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడినారు.



సమితి ప్రధాన కార్యదర్శి
డాగ్ హేమర్ షెల్డ్

కలుగజేసే ఏ సమస్యనుగాని భద్రతాసంఘమునకు నివేదించవచ్చును. సర్వ సభ్యసమావేశానికీ, మిగతా ఐక్యరాజ్యసమితి శాఖలకూ సైతం, వారు విచారించడానికి, కొన్ని వివాదాంశాలను సూచింపవచ్చును.

ప్రధానకార్యదర్శి ఐక్యరాజ్యసమితిలోని సభ్యులకు, తదితర శాఖలకు సహాయం చేయడానికి ఎప్పుడూ అందుబాటులోనే ఉంటాడు. సభ్యుల విభిన్నాభిప్రాయాలవల్ల వారు ఏకాభిప్రాయానికి రావడం అనేది తరుచు అతిక్లిష్టమూ, దుస్సాధ్యమూ అవుతూ ఉంటుంది. ఎంతో సహృదయతా, రాజకీయ పరిజ్ఞానమూ అవసరమైన అత్యంత సున్నితసందర్భాలలో అనేకసార్లు ప్రధాన కార్యదర్శి సహాయం ప్రతినిధులు కోరటం పరిపాటి అయిపోయింది.

ఐక్యరాజ్యసమితి ఉద్దేశ్యాలను పాటించటం తప్ప మరే ఆసక్తీ ప్రధాన కార్యదర్శికి ఉండదు. అతడు ఇష్టాయిష్టములతో ఆటలాడుటకు తావులేదు. ఐక్యరాజ్యసమితి ప్రతినిధులు తమ స్వవిషయాలను తామే చూచుకోవలసి ఉంటుంది.

ప్రధానకార్యదర్శి తీర్పునందు విశ్వాసం కాలక్రమేణ స్థాయి పెరుగుతోంది. ఎవరి మనస్సూ నొప్పించకుండా, తన రాజకీయ చతురతతో

మరొకంటివానికి తెలియనట్లుగా వ్యవహరించటంవల్ల ఆయాదేశాల విభేదాలు తొలగిపోయే మార్గాలను కనిపెట్టడానికిగాను వారి ప్రతినిధులతో అతను కలిసి తరుచు పనిచేయగలిగాడు.

## అంతర్జాతీయ ప్రభుత్వఉద్యోగులు

ప్రధాన కార్యదర్శికి ఒక అంతర్జాతీయ సిబ్బంది సహాయం ఉన్నది. ఈ సిబ్బంది సభ్యులే అంతర్జాతీయ ప్రభుత్వ ఉద్యోగులు. వీరు ఐక్యరాజ్య సమితివద్దనుండి తప్ప మరి ఎవ్వరి ఆదేశాలను స్వీకరించరు.

ప్రధాన కార్యదర్శి కార్యాలయ సిబ్బంది పనిపాటల్లో కల్పించుకుని తమ పలుకుబడిని ఏమాత్రం ఉపయోగించకుండునట్లు సభ్యత్వరాజ్యాలు నిబంధనావళిననుసరించి కట్టుబడిఉన్నాయి.

భౌగోళికప్రాతిపదికమీద వీలయినంత విస్తృతంగా ప్రధానకార్యదర్శి కార్యాలయ సిబ్బందిని ఎంచుకున్నారు. కార్యదర్శి కార్యాలయంలో సుమారు నాలుగువేలమంది ఉద్యోగులు ఉన్నారు. ఇందులో ఇంచుమించు మూడువేల మంది న్యూయార్కు నగరంలోని ప్రధాన కార్యాలయంలో ఉన్నారు. మిగిలిన వారు అందరూ ప్రపంచమంతటా బ్రాంచి ఆఫీసులలోనూ, సమాచార కేంద్రాలలోనూ, దౌత్యకార్యాలయాలలోనూ వ్యాపించి ఉన్నారు.



కార్యదర్శి కార్యాలయంలో ఆయాదేశాలకు సంబంధించినవారు ఎంత మంది పనిచేస్తున్నదీ, ఆ సభ్యత్వరాజ్యాలు బడ్జెటులో ఎంత సొమ్మును ఇవ్వగలుగుతున్నారో దానిమీద ఆధారపడి ఉంటుంది. మొత్తం బడ్జెటులో యునైటెడ్‌స్టేట్సు దాదాపు మూడవవంతు సొమ్మును సమకూరుస్తున్నందువల్ల కార్యదర్శి కార్యాలయసిబ్బందిలో మూడవవంతు యునైటెడ్‌స్టేట్స్ పౌరుల వల్లనే నింపబడినది.

కార్యదర్శి కార్యాలయంలో జరుగు పనులు అనేకరకాలుగా ఉంటాయి. ప్రధానకార్యదర్శికి సహాయం, సలహాలు ఇవ్వడం మొదలు కార్యాలయ భవనములను కాపాడటం, ఐక్యరాజ్యసమితి వివిధశాఖలకు, కమిటీలకు నివేదికలను తయారుచేయటంవరకూ పనులు ఉంటాయి. ఈ పుస్తక ప్రారంభంలో చెప్పిన దుబాసీలు కార్యదర్శి కార్యాలయ సిబ్బంది ఉద్యోగులే.

## శాంతికీ, ఉత్తమ ప్రపంచానికీ కృషి చేయువారు

ఐక్యరాజ్యసమితి అనే యంత్రాన్ని మృదువుగా నడిపించే తైలమే యీ కార్యదర్శి కార్యాలయం అని అప్పుడప్పుడు వర్ణిస్తూ ఉంటారు. తమ పనుల్లో ప్రతినిధులకు సహాయంచేసే ఒక రకమైన అనుభవ నిలయంగా కూడా ఇది రూపొందింది.

తమ జాతులూ, నేపథ్యాలూ, దృష్టులూ వేరువేరైనా, కార్యదర్శి కార్యాలయంలోని సిబ్బంది సభ్యులు మిగతా దేశాలలో పనిచేసే ఉద్యోగిబృందాల మాదిరిగానే కలసిమెలసి పనిచేస్తారు.

ఆధునికప్రపంచంలో అంతర్జాతీయ ప్రభుత్వ ఉద్యోగి ఒక కొత్త రకం ఉద్యోగస్థుడనే చెప్పాలి. అతడు అంతర్జాతీయ శాంతికీ, ప్రపంచ యోగక్షేమానికీగాను అన్నిరాజ్యాల కార్ఖానాలో పనిచేస్తున్నాడు. ఈనాడు ఐక్యరాజ్యసమితిలోని అంతర్జాతీయశాఖలలో పనిచేయువారి మొత్తం సంఖ్య దాదాపు పదివేలమందికి తగ్గదు. రేపటి ప్రపంచంలో యీ సంఖ్య మరింత పెరగగలదు.



సమితి కార్యాలయభవనంలో యునెస్కో
శిల్పవిన్నాణాన్ని ప్రదర్శిస్తున్న దక్షిణపు వసారా.

## ఐక్యరాజ్యసమితి ప్రాముఖ్యత

ఐక్యరాజ్యసమితి వివిధశాఖలద్వారా తన ముఖ్య ఆదర్శాలను ఎట్లా సాధించేదీ ఇప్పుడు మీరు తెలుసుకున్నారు. శాంతిని సంరక్షించడం, జీవన ప్రమాణాలను అభివృద్ధిపరచడం, మానవసంక్షేమానికి పాటుబడడం, ఆయా దేశాల స్వాతంత్ర్యాన్ని ప్రోత్సాహించడం, వారిమధ్య స్నేహసుహృద్భాంధవ్యాన్ని నెలకొల్పడం—దాని ముఖ్యకర్తవ్యాలు.

ఐక్యరాజ్యసమితి పుట్టిన కొద్దిసంవత్సరాలలోనే తనకి ఎంత ప్రాముఖ్యత ఉన్నదీ వెల్లడించగలిగింది. యుద్ధము అనివార్యమనుకున్న తరుణాల్లో శాంతిని నెలకొల్పగలిగింది.

ప్రపంచంలోని వేర్వేరు ప్రాంతాలలో పోరాటాలు జరిగినప్పుడు అక్కడ శాంతిని పునరుద్ధరించడానికి యు. ఎన్. ఏవిధంగా సహాయం చేసిందీ మనం తెలుసుకొన్నాము. 1956 నాటి సూయజ్ విషమపరిస్థితి ఒక చక్కని ఉదాహరణ. ఇటీవల, 1958 లో లెబనాన్, జోర్డాన్, ఆ ప్రక్కనున్న మధ్యప్రాచ్యంలోని దేశాలు పోట్లాటద్వారా కాకుండా శాంతియుతంగా తమ విభేదాలను పరిష్కరించుకోవడానికి యు. యన్. సహాయం చేసింది.

ఆ పరిస్థితులే గనక కొనసాగి ఉంటే అవి ఏ పెద్దయుద్ధానికైనా దారితీసేవో, లేవో యిదమిత్థంగా ఎవ్వరూ చెప్పలేరు. కాని, శాంతికోసమై





ప్రకృతిశోభలనీనే చెర్రీచెట్ల సుందరోద్యానం మధ్య ఆకాశాన్నందుకుంటున్న సమితి సుందరభవనం

యు. ఎన్. శక్తివంతమైన తన ఒత్తిడిని గనక ఉపయోగించకుండా ఉంచే మాత్రం యుద్ధం తప్పకుండా వచ్చిరేది.

ఐక్యరాజ్యసమితి దాని ముఖ్యపరమావధియైన శాంతిని రక్షించటమే కాకుండా చరిత్రాత్మకమైన అనేక ప్రప్రథమ కార్యాలను సాధించింది.

ఐక్యరాజ్యసమితియొక్క నిబంధనావళి చరిత్రలోనే ఒక గొప్ప మైలురాయి. దేశదేశాలమధ్య శాంతియుతసంబంధాలు నెలకొల్పుటకు కొన్ని నిబంధనలను ఏర్పరచింది. ఐక్యరాజ్యసమితి నిబంధనావళిలో బలప్రయోగం నిషేధింపబడినది. కాని, ఆత్మసంరక్షణమప్పుడుగాని, భద్రతాసంఘం ఆదేశించినప్పుడుగాని మాత్రం వాడటానికి అవకాశము ఇవ్వబడింది.

చరిత్రలో ప్రప్రథమంగా, కొరియాదేశంలో, సాయుధ దండయాత్ర ఒక అంతర్జాతీయ వ్యవస్థద్వారా అరికట్టబడ్డది. పదహారు ప్రతినిధిరాజ్యాలు తమ సైనికదళాలతో కలసిమెలసి ఐక్యరాజ్యసమితి పతాకంక్రింద పోరాడాయి. మరల సూయజ్ విషమపరిస్థితిలో కూడా ఐక్యరాజ్యసమితి అత్యవసర



సమితి సభ్యత్వరాజ్యాల పతాకలన్నీ పక్కపక్కనే బలేబాగా ఎగురుతున్నాయి.

సైనికదళం ప్రప్రథమంగా అంతర్జాతీయ దళంగా వెళ్లి దండయాత్రకు వచ్చిన సైనికదళాన్ని శాంతియుతంగా వెనుకకు మరల్చగలిగారు.

యుద్ధమును నిరోధించటం, లేదా అరికట్టటం అనే కార్యసిద్ధివల్లనే ఐక్యరాజ్యసమితి తన ప్రాముఖ్యతను ఋజువు పరుచుకోగలిగింది. ఐతే ఇంకా ఇతర రంగాలందు వైభవోపేతంగా కాకున్నా, సామాన్యవిధాల మానవుల శాంతిసంక్షేమాలకై తీవ్రకృషి చేసింది.

శాస్త్రీయవిజ్ఞానం ప్రపంచమంతటా అభివృద్ధిచెందటానికి ఎంతో దోహదం చేసింది. శాంతియుత ప్రయోజనాలకై పరమాణుశక్తి వినియోగానికి అమితప్రోత్సాహమిస్తున్నది. ఐక్యరాజ్యసమితి ప్రపంచమంతటా ఒక న్యాయబద్ధమైన నిబంధనలను నెలకొల్పడానికి కృషిచేస్తూ ఉన్నది. ప్రజాసమూహాలను ఏకమొత్తాన, సమూలంగా నాశనం చేయటం నేరంగా ప్రకటించింది. ఇంకా అనేకవిధాల నిబంధనావళిలో చెప్పబడిన ఆదర్శాలప్రకారం ఐక్యరాజ్య సమితి కృషిచేస్తూ ఉన్నది.

## భా వి కా ల ము

వివిధదేశాలమధ్యగల విభేదాలను విచారించగల ప్రపంచసంస్థ ఐక్య రాజ్యసమితి ఒక్కటే అని చెప్పాలి. ప్రాక్పశ్చిమదేశాలు నిరంతరం కలుసుకోవటానికి స్థానమును ఏర్పరచినది యీ సంస్థే. ప్రపంచసమస్యల మంచి చెడ్డలన్నీ పరిశీలింపబడటం, అన్నిదేశాల రాజ్యాంగవిధానాలను విచారించడం ఇక్కడనే జరుగుతాయి. ఇక్కడే అన్ని సభ్యత్వరాజ్యాలూ, పరస్పరం తమ విజ్ఞానాన్ని పంచుకొనవచ్చును. అటుపై ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని శాంతియుతమైన ప్రేరేపణగా ఉపయోగింపవచ్చును.

మార్పు అనేది జీవితవిధానము. దేశదేశాలమధ్య మార్పులు రాకమానవు. అవి అనివార్యములు. ఆ మార్పులు శాంతియుతంగా రాకపోతే పోరాటాలతోను, రక్తపాతముతోను వస్తాయి. మారిపోతూన్న యీ ప్రపంచమందు, ఐక్యరాజ్య సమితి, హింసాత్మకశక్తులను స్వాధీనంలో ఉంచుకొనడమేగాకుండా శాంతియుతమైన మార్పులు తీసుకురావడానికి గూడా సహాయం చేస్తుంది.

ఈవిధంగా ఐక్యరాజ్యసమితి ఆలనాపాలనలో ప్రపంచమంతా క్రమపద్ధతిని శాంతియుతమైన ప్రగతిని సాధింపగలదని ఆశింపవచ్చును.

ఐనప్పటికి, ఐక్యరాజ్యసమితి ఒక సంపూర్ణమైన వ్యవస్థ కాదన్న విషయం సత్యమే. దానినుంచి ఆశించిన అన్ని ముఖ్యాదర్శాలనూ అది సాధింపలేదు. అది కొన్ని రంగాలలో విజయం సాధింపలేకపోవటానికి కారణం దేశదేశాలమధ్య ఇమిడియున్న భీతీ, అపనమ్మకాలే తప్ప వేరే కారణం ఏమీలేదు.

ఐక్యరాజ్యసమితి ప్రపంచాన్ని యథాతథంగా కనబరచు అద్దము వంటిది. అక్కడ జరుగు వాగ్వివాదాలలోని తీవ్రత ప్రపంచ ఉద్రిక్తతను సూచిస్తుందేగాని దానికి కారణాన్ని కాదు. ఐక్యరాజ్యసమితి పరస్పర అంగీకారాన్ని సాధించడానికి అవసరమైన స్థలాన్నీ, సదుపాయాల్నీ ఏర్పాటు చేస్తున్నప్పటికీ యథార్థమైన సమాధానము కావాలనెడి అభిలాష ఆయా దేశాలకు ఉండాలి.

అన్నిదేశాలకూ ఒక నైతికప్రమాణాన్ని ఐక్యరాజ్యసమితి నిబంధనావళి ఏర్పాటుచేసింది. ప్రపంచ అభిప్రాయం, వివిధదేశాలపై ఒక గొప్ప శక్తిగా పనిచేసి, నిబంధనావళిలోని ఆదర్శాలకు బద్ధులై మెలగుటకు తప్పక సహాయపడగలదు. అన్నిదేశాలూ తాము చేసే పనులకు ఐక్యరాజ్యసమితి యొక్క ప్రోత్సాహం కావాలనే కోరుతూ ఉన్నాయి.

విక్టర్ హ్యూగో ఒకసారి ఇట్లా వ్రాశాడు:—"కాలానుగుణంగా పరిపక్వమైన భావం కన్నా బలవత్తరమైనది ఇంకొకటి యీ ప్రపంచంలో లేదు." విశ్వమానవకుటుంబమనే ఉదాత్తమైన ఆశయం కార్యరూపంలోనికి రావలసిన తరుణం ఆసన్నమైనది. ఈ అన్నిదేశాలూ చేతులు కలిపి, శాంతి స్థాపనకై బద్ధకంకణులైతేనేగాని మానవజాతికి తుష్టిపుష్టులు లభింపనేరవు.

ఈ క్రిందివిధంగా తప్ప మరోవిధంగా యీ మహోన్నత ఆశయాలను వ్యక్తీకరించలేం.

# ఐక్యరాజ్యసమితి నిబంధనావళి అవతారిక

ఐక్యరాజ్యసమితికి చెందిన అందరు ప్రజలం యీవిధంగా నిశ్చయించుకున్నాము :

రాబోవు తరమువారిని యుద్ధములబాధనుండి రక్షించుట. ఏలయన, మా తరములోనే రెండు పర్యాయములు యీ యుద్ధములవలన మానవులు చెప్పనలవికాని దుఃఖములకు పాలైనారు.

మానవహక్కులందు, మానవవ్యక్తిత్వ విలువలూ, గౌరవములందు విశ్వాసాన్ని పునరుద్ఘాటిస్తున్నాము. స్త్రీ, పురుషుల, పెద్ద, చిన్న దేశాల సమాన హక్కులను, సంధిషరతులద్వారా ఉత్పన్నమయ్యే లావాదేవీలను, న్యాయబద్ధముగా తీర్మానించిన కర్తవ్యాలను గౌరవంగా కొనసాగించుట, అంతర్జాతీయ న్యాయశాసనములను ఉద్ధరించుట.

సాంఘికపురోభివృద్ధి, సువిశాలస్వాతంత్ర్యంలో మానవజీవితపరిసితులను ప్రోత్సాహపరచుట.

మరియు యీ ముఖ్యాదర్శాలకై—

సహనదృష్టితో, పరస్పరమైత్రితో శాంతియుతంగా మంచి ఇరుగుపొరుగువారిగా మెలగుట.

మాబలమునంతయు అంతర్జాతీయ శాంతిభద్రతలను నిలుపుటకై కలిసికట్టుగా వినియోగపరచుట.

నిబంధనావళిలోని సూత్రములనూ, నియమాలనూ ఉద్ఘాటించుట, సైనిక బలమును సర్వప్రజాక్షేమమునకు తప్ప ఇతరత్రా వినియోగపరచకుండుట.

అంతర్జాతీయ సంస్థను సర్వమానవ ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికై వినియోగపరచుట.

కలిసికట్టుగా మా కృషిని ఏకమార్గాన మళ్ళించి యీ ఆశయాలను సాధించడానికి తీర్మానించుకున్నాము.

# ఐక్యరాజ్యసమితి ప్రారంభ విశేషాలు

1941 అధ్యక్షుడు రూజువెల్టు, ప్రధానమంత్రి చర్చిల్ అట్లాంటిక్ నిబంధనావళిమీద సంతకాలుచేశారు. యుద్ధానంతరం, సుస్థిరమైన శాంతి నెలకొల్పబడుతుందని వారి విశ్వాసంగా తెలిపారు.

1942 ఐక్యరాజ్యసమితి ప్రకటనమీద ఇరవైఏడుదేశాలు సంతకాలు చేశాయి. యుద్ధానంతరం వారందరూ శాంతిస్థాపనకై పనిచేయగలమని వాగ్దానం చేశారు.

1944 వాషింగ్‌టన్ పట్టణంలో డంబార్‌టన్ ఓక్స్ సభ జరిగింది. యునైటెడ్‌స్టేట్సు, బ్రిటన్‌సామ్రాజ్యం, సోవియట్‌యూనియన్, చైనాదేశాల ప్రతినిధులు శాంతిని నెలకొల్పడానికి ప్రపంచసంస్థ నొకదానిని స్థాపించడానికి అంగీకరించారు. ఈ వ్యవస్థలో ముఖ్యమైన సంఘము భద్రతాసంఘం. ఇందులో చైనా, ఫ్రాన్సు, సోవియట్‌యూనియన్, బ్రిటన్, యునైటెడ్‌స్టేట్సు దేశాలకి శాశ్వతస్థానములు ఉంటవి.

1945 శాన్‌ఫ్రాన్సిస్కోలో ఐక్యరాజ్యసమితి నిబంధనావళిమీద యాభై దేశాలు సంతకాలు చేశాయి. పోలండుదేశం తరువాత సంతకం చేసింది. ఈ నిబంధనావళి అమలులోనికి వచ్చిన అక్టోబరు 24 వ తేదీని ఇప్పుడు ఐక్యరాజ్యసమితి దినంగా పరిగణించి పండగ చేస్తున్నారు.

1946 సర్వసభ్యసమావేశంయొక్క మొదటిసభ లండను పట్టణంలో ప్రారంభమైంది. తరువాత భద్రతాసంఘంయొక్క మొదటి సమావేశం జరిగింది. ఈ సంవత్సరంలోనే ఐక్యరాజ్యసమితి తాత్కాలిక ప్రధాన కార్యాలయం న్యూయార్కు పట్టణమువద్దగల లేక్ సక్సెస్ అనేచోట నెల కొల్పబడింది.

1947 సర్వసభ్యసమావేశం ఐక్యరాజ్యసమితి పతాకాన్ని ఆమోదించింది.

1952 న్యూయార్కు నగరమందలి ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యాలయంలోని నూతన జనరల్ అసెంబ్లీహాలులో సర్వసభ్యసమావేశం తన ప్రప్రథమ సమావేశాన్ని జరుపుకుంది.

# ప్రత్యేకపదాలు

ఏకాభిప్రాయం (Unanimity) :—సభ్యులందరూ ఒకేఅభిప్రాయము వెల్లడిస్తూ వోటుచేయుట.

కమిటీ (Committee) :—ఒక వ్యవస్థలో ఒక్కొక్క ప్రత్యేకవిషయమును గమనించుటకు నియమించుసంఘము.

కమిషన్ (Commission) :—కమిటీవంటిదే. దీనిని విచారణసంఘము అని కూడ అనడం కద్దు.

కౌన్సిలు (Council) :—ఒక వ్యవస్థలోని ముఖ్యమైన శాఖ. దీనిని స్థూలంగా సంఘం అనే పేర్కొంటూ ఉంటారు. ఐక్యరాజ్యసమితిలో ఇటువంటి కౌన్సిళ్లు మూడు ఉన్నాయి—భద్రతాసంఘం, ఆర్థిక-సాంఘికసంఘం, ధర్మకర్తృత్వసంఘం.

గైరుహాజరు (Abstention) :—సభ్యరాజ్యం ఏదైనా ప్రతిపాదనకు అనుకూలంగాగాని, ప్రతికూలంగాగాని వోటుచేయకుండా మిన్నకుండడం. ఇది సభనుంచి బయటికి నడిచైనా చేయవచ్చు; లేక లోపలఉండే ఉలకక పలకక కూడ చేయవచ్చు. ఈగైరుహాజరు వోటుకిందికి లెక్కకురాదు.

చర్చనీయాంశాలు (Agenda) :—సభలో చర్చకు ఉంచెడి విషయాల పట్టిక, లేదా కార్యక్రమం.

తీర్మానం (Resolution) :—సభలో (ఇక్కడ సమితిలో) ఆమోదించిన ప్రతిపాదన. దీనిని నిర్ణయం అనికూడ అనవచ్చు.

ధర్మాధికారం (Moral Authority):—కట్టుదిట్టమైన సంస్థగా తనకుగల ప్రతిష్ఠతో సర్వప్రపంచాన్నీ ఒకతాటికిందికి ఆకట్టుకునివచ్చే సమితి పలుకుబడి, అధికారమూ. దీనినే నైతికఆధిపత్యం అని కూడ అంటారు.

పరిపాలనాధికారరాజ్యం (Administering Authority) :— ధర్మ కర్తృత్వ ప్రాంతాన్ని పరిపాలన చేసే రాజ్యం.

పరిశీలకులు (Observers):—సంగతిసందర్భాలనూ, పరిస్థితులనూ గమనిస్తూ, రగళ్లను తీసుకొనివచ్చే చర్య లేవైనా జరుగుతున్నట్లు కనిపిస్తే తమకు నివేదించడానికి సమితి నియమించే వ్యక్తులు.

ప్రతినిధి (Deligate) :—ప్రతినిధివర్గంలోని సభ్యుడు.

ప్రతినిధివర్గం (Deligation) :—సమితిలో వివిధదేశాల తరఫునా ఉండెడి ప్రతినిధులూ, వారి సిబ్బందీ.

ప్రతిపాదన (Proposal) :—సమితిలో చర్చకూ, తీర్మానానికీ పెట్టే సూచన. చిత్తుతీర్మానం అనికూడ దీనిని అంటారు. అటూ ఇటూ తేలని దశలోని తీర్మానమన్నమాట.

బలవంతంగా అమలు జరుపు చర్య (Enforcement Action) :— శాంతిని కాపాడుటకు వివిధదేశాలనూ విధిగా లొంగదీసే చర్య.

మధ్యస్థం (Mediation) :—తగాదా పడుతున్న దేశాలమధ్య ఆ తగాదాలను శాంతిపద్ధతుల్లో తమలోతామే పరిష్కరించుకోవడానికి వారిమధ్య జరిపే రాజీప్రయత్నం.

మిషన్ (Mission) :—ప్రతినిధివర్గం లాంటిదే.

రాజీ (Conciliation) :—తగాదాలను శాంతియుత పద్ధతుల్లో తమలోతామే పరిష్కరించుకోవడానికి జరిపే సమాధానకృషి.

రాజ్యాంగనిర్మాణం (Constitution) :—రాజ్యాలుగాని, ఏవైనా సంస్థలుగానీ తాము తూచా తప్పక అనుసరించి, ఆ ప్రకారం నడుచుకోవడానికి నిర్ణయించుకొనే మూలసూత్రాలు, లేక నియమ నిబంధనలు.

రెప్రజెంటేటివ్స్(Representatives) :—డెలిగేట్లనే రెప్రజెంటేటివ్సు అనికూడ అంటారు. అంటే ప్రతినిధులన్నమాట.

వీటో (Veto) :—భద్రతాసంఘంలోని ఏ శాశ్వత సభ్యుడైనా ఏదైనా తీర్మానానికి వ్యతిరేకంగా వోటుచేస్తే అది వీటో అనబడుతుంది.

శాఖ (Organ) :—సమితిలోని ముఖ్యమైన అధికారవర్గం. ఇటువంటి ముఖ్యశాఖలు సమితిలో ఆరు ఉన్నాయి.

సంధి (Truce) :—యుద్ధవిరమణ, లేదా యుద్ధ సమాధానం.

సమాధానపత్రం (Treaty) :— రెండు, లేదా అంతకుమించిన దేశాలమధ్య కుదిరే లాంఛన ప్రాయమైన ఒప్పందం.

సర్వస్వతంత్రదేశం (Sovereign State) :—మరొకదేశం పెత్తనంలేకుండా సర్వస్వేచ్ఛగానూ, స్వతంత్రంగానూ ఉండే దేశం.

సెషన్ (Session) :—సర్వసభ్యసమావేశం జరిపే సమావేశాన్నే సెషన్, లేక సభ అని పిలుస్తారు.

సాంకేతిక సహాయం(Technical Assistance):—డబ్బూసరకులూ మూలంగా కాకుండా సాంకేతికజ్ఞాన ప్రదానరూపంలోనూ, శిక్షణరూపంగానూ వివిధ దేశాలకూ ఇచ్చేసహాయం.

స్వయంనిర్ణయం(Self Determination) :—ప్రజలు తమలోతామే స్వయంగా నిర్ణయాలు చేసుకొనే హక్కు.

స్వయంపరిపాలన (Self Government):-ప్రజలు తమను తామే స్వయంగా పరిపాలించుకొనే హక్కు.

---

## సమితి సభ్య దేశాలు.

(1) ఆఫ్ఘనిస్తాన్.
(2) ఆల్బేనియా.
(3) అర్జెంటినా.
(4) ఆస్ట్రేలియా.
(5) ఆస్ట్రియా.
(6) బెల్జియం.
(7) బొలీవియా.
(8) బ్రెజిల్.
(9) బల్గేరియా.
(10) బర్మా.
(11) బైలోరష్యన్ ఎస్. ఎస్. ఆర్.
(12) కాంబోడియా.
(13) కెనడా.
(14) సింహళం.
(15) చిలీ.
(16) చైనా.
(17) కొలంబియా.
(18) కోస్టారికా.
(19) క్యూబా.
(20) చెకొస్లొవాకియా.
(21) డెన్మార్కు.
(22) డొమినికన్ రిపబ్లిక్.
(23) ఈక్వెడార్.
(24) ఎల్ సాల్వడార్.
(25) ఇథియోపియా.
(26) మలయా ఫెడరేషన్.
(27) ఫిన్లెండు.
(28) ఫ్రాన్సు.
(29) ఘానా.
(30) గ్రీసు.
(31) గ్వాటిమాల.
(32) గినీ.
(33) హైటీ.
(34) హొండూరాస్.
(35) హంగరీ.
(36) ఐస్లెండు.
(37) ఇండియా.
(38) ఇండొనీసియా.
(39) ఇరాన్.
(40) ఇరాక్.
(41) ఐర్లాండు.
(42) ఇస్రెయెల్.
(43) ఇటలీ.
(44) జపాన్.
(45) జొర్డన్.
(46) లావోస్.
(47) లెబనాన్.
(48) లైబీరియా.
(49) లిబ్యా.
(50) లక్సెంబర్గ్.
(51) మెక్సికో.
(52) మొరాకో.
(53) నేపాల్.
(54) నెదర్లెండ్సు.
(55) న్యూజీలెండ్.
(56) నికారాగ్వా.
(57) నార్వే.
(58) పాకిస్తాన్.
(59) పెనామా.
(60) పెరాగ్వే.
(61) పెరూ.

(62) ఫిలిప్పీన్సు.
(63) పోలెండ్.
(64) పోర్చుగల్.
(65) రుమేనియా.
(66) సౌదీఅరేబియా.
(67) స్పెయిన్.
(68) సూడాన్.
(69) స్వీడన్.
(70) థాయిలెండ్.
(71) టునీసియా.
(72) టర్కీ.
(73) యుక్రేనియన్ ఎస్. ఎస్. ఆర్.
(74) దక్షిణాఫ్రికా.
(75) సోవియట్ యూనియన్.
(76) యునైటెడ్ ఆరబ్ రిపబ్లిక్.
(77) బ్రిటన్.
(78) అమెరికా.
(79) ఉరుగ్వే.
(80) వెనిజూలా.
(81) యెమెన్.
(82) యుగోస్లావియా.

## కొత్తగాచేరిన సభ్యదేశాలు

(83) సైప్రస్.
(84) కేమరూన్.
(85) సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్.
(86) చాడ్.
(87) దహోమి.
(88) గేబన్.
(89) ఐవరీ కోస్ట్.
(90) మలగాసీ రిపబ్లిక్. (మెడగాస్కర్)
(91) నైజర్.
(92) సోమాలియా.
(93) టోగో.
(94) అప్పర్ వోల్టా.
(95) కాంగో రిపబ్లిక్ (బ్రెజావిల్)
(96) కాంగో రిపబ్లిక్ (లియోపాల్డువిల్)
(97) సెనెగల్.
(98) మాలి.
(99) నైజీరియా.
(100) సిరాలియోన్.
(101) మంగోలియా.
(102) మారిటేనియా.
(103) టాంగనీకా.
(104) సిరియా.



**Weldun Press, Madras—21.**



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B148 |
| పుస్తకం పేరు | ఐక్యరాజ్య సమితి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 |
| లేని పేజీలు | 1-4 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |